# వెంకన్న కొలువు

బొమ్మల కథ: బాపు

21




రాజీ! నా గురించి పేపర్లో చదవలేదా? నువొచ్చి నను పలకరిస్తావనుకున్న!

పోన్లే అని నేనే పలకరించడానికొస్తే మాట్లాడవేం - ఐతే నిన్ను చేసుకోను పో!

ఇప్పుడు నిన్ను చేసుకుంటానని ఎవరన్నారూ?

ఆఁ!

ఐతే రాజీ! విను- మొన్న రాజధాని నగరంలో నా ఫోటో పేపర్లో చూసి పద్దెనిమిదేళ్ల కోటీశ్వరి నా దగ్గరకొచ్చి కావలేసుకొని.....

నీకు పెళ్లయిందా- అవకపోతే నిన్ను చేసుకుంటా - ఒకవేళ పెళ్లయిందా- నెవ్వర్ మైండ్ నీ గర్ల్ ఫ్రెండుగా వుంటా - అంది - ఆలోచించి చెప్తానన్న-

రాజీ! ఇక నే ఆ అమ్మాయి దగ్గరికే పోతున్నా!

వెంకట్రావు చెంప మరోసారి పగిలింది

ఛెళ్ళు

(ఇంకా ఉంది)

నవ్వులాటకు అతనిని కవ్వించి కన్నీటిపాలైంది.
ఆ కన్నీరు తుడిచి ఆమెను నవ్వించటమే అతని గెలుపు అయింది.

అన్నపూర్ణ ఆర్ట్ పిక్చర్స్

# విచిత్రబంధం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత:









# చక్కని తెలుపు
# చిక్కని నలుపు
# సరియైన ప్రతిబింబం
# పెద్ద చిత్రాలను
# తీసుకోగల సావకాశం
# పొగమంచులో కూడా
# పనిచేస్తుంది

సుస్పష్టమైన ప్రింట్లు మరియు ఎన్‌లార్జిమెంటుల కోసం, ఆగ్ఫా-గెవార్ట్ ఫోటో పేపరునే కావాలని అడగండి. ఎంత చక్కని ఫోటోలనైనను, చవకబారు ఫోటో పేపరు వాడితే చెడిపోతాయను విషయమును జ్ఞాపకమును ఉంచుకోండి. ఆగ్ఫా-గెవార్ట్ ఫోటో పేపరు కలకలలాడే ఫోటోలకు చాలా నమ్మకమైనది. ప్రకాశము కొరకు, విశదమైన వ్యత్యాసానికి. లుపెక్స్—ఎటువంటి నెగెటివ్‌ల నుండియైన పరిణతి పొందిన ఫోటోల నిచ్చే కాంటాక్టు పేపరు.

బ్రొవిరా—మీ చిన్న చిన్న ప్రింటలో దాగియున్న అందాలను చూపించే ఎన్‌లార్జింగ్ పేపరు.

ఆగ్ఫా-గెవార్ట్ అధీకృత విక్రయదారులందరి వద్ద దొరుకుతాయి.

ఆగ్ఫా-గెవార్ట్ వారి సహకారంతో.

ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్‌చే తయారు చేయబడినది.



సోల్ డిస్ట్రిబ్యూటర్లు:




ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్

బొంబాయి • కొత్త ఢిల్లీ • కలకత్తా • మద్రాసు.

® ఫోటోగ్రాఫిక్ వస్తువుల ఉత్పత్తిదారులైన ఆగ్ఫా-గెవార్ట్ అంట్‌వెర్ప్/లెవెర్కుసెన్ యొక్క రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు.




SIMOES/AG/3-72

# వెంకటరాఘవన్ కీ ప్రియమైన కాఫీ:

## నెస్‌కాఫే!

"ఉత్తేజ భరితమయిన
టెస్టు ఆఖరున ఒక
- కప్పు వేడి వేడి
నెస్‌కాఫే విలువ
తెలుస్తుంది. అలసట
తీరాలంటే
దానితోనే."



అతనికి తెలుసు కాఫీకి అలవ-
డినవారికి తెలిసినట్టు, ఇతర
ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న
నెస్‌కాఫే విశిష్టమని. దానిని
ప్రత్యేకం తనవంటి కాఫీ
కాముకులకోసం తయారు చేశారని
అత్యుత్తమమయి 100%
పరిశుద్ధమయిన దక్షిణాది
కాఫీ గింజలతో.




## నెస్‌కాఫే

నెస్‌కాఫే మిక్కిలి ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది

ACIL-90(†) 233 TEL

పాఠకులకు, రచయిత(్రు)లకి మా దసరా శుభాకాంక్షలు. -సం॥

### కథలు

శాయిగారి 'హాశ్చర్యం కథ' చదివిన తరువాత బోల్డంత హాశ్చర్యం వేసిందంటే అతిశయోక్తి కానేకాదు. మిస్టర్ కొండేటి (నందిగామ)

* * *

'అన్వేషి' కథ చివర చదివినపుడు ఎందుకో దేవదాసు గుర్తు వచ్చాడు.

బి. జానకి (పలమనేరు)

* * *

'పతివ్రత' డా. ముదికొండ శివప్రసాద్ వ్రాసినది ముగింపు అర్థంగాలేదు. డబ్బు, బంగారం కనకం ఇంట్లో దాచుకుంది 'సౌందర్య.' కావున ఆమె స్వార్థపరురాలు. రచయిత, పతివ్రత అని వ్యంగ్యంగా వ్రాశాడనుకుంటాను.

మూల్పూరి విష్ణుప్రసాద్, లక్ష్మీకుమార్ (హైదరాబాదు)

### సీరియల్

22—9—72 సంచికలో 'విద్యార్థి' సీరియల్‌లో 42 వ పేజి, 2 వ కాలం 5 వ లైనులో








# ఉత్తరాలు

'చివరకు యింకా ప్రపంచంలో అడుగుపెట్టని మేనల్లుడుమీద కూడా కోపం వచ్చింది అని అన్నారు విద్యార్థి.' కాని విద్యార్థి అక్కగారికి డెలివరీకాక ముందే మగపిల్లవాడని వూహించుకోవటం తప్పు! పుట్టేది మగపిల్లవాడు కావచ్చు, ఆడపిల్ల కావచ్చు!

బండారు పాండురంగేశ్వరరావు, కర్రి సతీష్ (కొరుకొల్లు)

### వ్యాసాలు

హైదరాబాద్ నోట్‌బుక్ అనే శీర్షికలో శ్రీ తిరుమల రామచంద్ర తెలిపిన ఆ వారం వార్తా విశేషాలు చాల ప్రశంసనీయం. అక్కడ జరుగుతున్న కార్యక్రమ వివరాలే కాకుండా, మంచి చెడులు కూడ వేలెత్తి చూపితే బాగుంటుందని నా అభిప్రాయం.

ఉదాహరణకు ఒక విద్యార్థిగా నేను చెప్పేదేమంటే—హైదరాబాదులో ఉన్న ఇంటర్ మీడియట్ బోర్డు గత 'మే'లో జరిపిన పరీక్షలలో ఉత్తీర్ణుల జాబితాను ప్రకటిస్తూ కొన్ని అభ్యంతరాలున్న కారణంగా కొంతమంది అభ్యర్థుల ఫలితాలు తాత్కాలికంగా నిలిపివేసారు. ఆ అభ్యంతరాలు చాలమంది అభ్యర్థులు తొలగించుకొని దాదాపు రెండు నెలలయినా యింతవరకు వారి 'రిజల్ట్సు' ప్రకటించకపోవడంవల్ల ఒక సంవత్సరం ప్యాసయి ఉన్న విద్యార్థులకు వృధాగా నిరుపయోగం అయింది. తప్పిన విద్యార్థులకు కూడ సెప్టెంబర్‌లో మరల పరీక్షలు వ్రాసే అవకాశం చేజారిపోయింది

ఇలాంటి ముఖ్య విషయాలు కూడ తేటతెల్లం చేస్తూంటే ఈ శీర్షికకు ఇంకా ప్రయోజనం చేకూరుతుంది.

పావులూరి లక్ష్మణబాబు, (తెనాలి)

* *

కస్తూర్బా బాలికా విద్యాలయంలోని ప్రేమలత యనెడి హరిజన బాలిక ఆత్మహత్యకు కారణము తెలుపమని కొందరు హర్తాళ్ చేసినందుకు 250 పైనా అరెస్టు.

ఇదే పోలీసుల విధి. కారణము తెలుపుట ఎవరి విధో?

పాపం! జనసంఘం ఏదో హరిజన స్త్రీగదా యని 24 గంటలు నిరాహారదీక్ష యుంటే ఏది అరాచకమో తెలియని ఢిల్లీ ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ భరత్‌గారు 'నాలుక ఎల్చుకొంటున్నారు'

శ్రీ. వెంకటేశ్వరులు, (మద్రాసు)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 20-10-72
శ్రీవిరోధినామసం॥ ఆశ్వయుజమాసం॥ శు॥ త్రయో
సంపుటము : 6 ర సంచిక ; 6
స్థాపితము 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1
విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక


సిమ్లా ఒప్పందం అమలు పర్చడానికి
ముందుకు పోడానికి నేను చెయ్యతగింది చేస్తున్నాను
కుయుక్తులు


ధరలు పెరుగుదల నిరోధానికి కృషి
అల్లకల్లోలమైన నీటిలో
కమ్యూనిస్టుల చేపలవేట


మైసూరు ప్రభుత్వరంగం లో రూ. 500/- లోపు ఉద్యోగాలన్నీ మైసూరు వాళ్ళకే
ఇది దేశాన్ని నాశనం చేసే ప్రాంతీయాభిమానం


35 ఏళ్ల క్రితం
జపాన్ దండయాత్ర
చైనా


మా తప్పులు మన్నించండి
చైనా
జపాన్
నేడు
OOMMEN

# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

**అర్థకరీ చ విద్యా**

విద్య అనేది వింత జ్ఞానదాయిని అని మనం అనుకున్నా, అది అర్థకరి కానప్పుడు ప్రయోజనం గురించి, జ్ఞానం గురించి శంకించ వలసే వస్తుంది. అందువల్లనే మన పెద్దలు 'అర్థకరీ చ విద్యా' అని విద్యాసార్థక్యం ఉద్ఘాటించారు. చదివే హక్కును, ఉద్యోగపు హక్కుకు అనుసంధించాలని, అంటే, చదువుకున్న ప్రతివాడికీ ఉద్యోగం తప్పక ఉండే పద్ధతితో విద్యా ప్రణాళికను తమ ప్రభుత్వం రూపొందిస్తున్నదని తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం. కరుణానిధి సెప్టెంబర్ 20 వ తేదీన లింగంపల్లిలో శ్రీమతి సత్యమ్మ నరసింహారావు స్మారక కళాశాల నూతన భవనం ప్రారంభిస్తూ అన్నప్పుడు, విద్యార్థులకు, విద్యావంతులైన నిరుద్యోగులకు చాల ఉత్సాహమే కలిగింది. ఉద్యోగాలు చూపలేనప్పుడు ఇంతింత పెద్ద చదువు లెందుకు మరి? — అనేది నిరంతరమైన ప్రశ్న. పెద్ద పెట్టుబడితో పెద్ద చదువులు, ఆ చదువులున్నవారికే పెద్ద ఉద్యోగాలు— అన్నది శృంఖలిక. అంత పెట్టుబడిపెట్టి చదివినవారికి ఉద్యోగాలు లేకపోతే అలజడి కలుగక ఏమౌతుంది ? కాని, చదువుకూ, వృత్తికీ సంబంధం లేదనేది కొందరు మేధావుల వాదం. కబీరు నేత పని చేస్తూ, జీవిక గడపలేదా? అంటారు. కాని, కాలం మారింది. చదువు జ్ఞాన లక్ష్యం కలదే అయినా, అర్థకరి కూడా కావాలి.

**పారిస్‌లో**

**తెలుగుదేశపు బొమ్మలాట**

ప్రముఖ నర్తకి, నాట్యశాస్త్రజ్ఞ శ్రీమతి మృణాళినీ సారాభాయి సెప్టెంబర్ 22 న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ముచ్చటిస్తూ తెలుగుదేశపు బొమ్మలాటను తను పునరుద్ధరించానన్నప్పుడు కళాప్రియులు ఆనందం ప్రకటించారు. పారిస్‌లో జరుగనున్న అంతర్జాతీయ పుత్తలికోత్సవంలో పాల్గొనడానికి భారతదేశం నుంచి శ్రీమతి మృణాళిని బృందంవారు ఆరుగురు వెళ్ళారు, రామాయణం ప్రదర్శించడానికి గంటసేపు, తక్కిన రకరకాల పుత్తలిక నృత్యాలు చూపడానికి గంట కేటాయించారట. 'మనదేశపు బొమ్మలాట బొమ్మ యంత్ర నిర్మితం కాక చేతిపనితో తయారు కావడంవల్ల విదేశాల బొమ్మలకన్నా చాల అందంగా ఉంటాయి. కనుక విదేశీయుల మెప్పు పొందుతున్నాయి' అన్నారు ఆమె. స్పష్టత, సత్యనిష్ఠ కళలో ముఖ్యమంటారు ఆమె. ప్రాచీన సంప్రదాయం సంకరం కాగూడదని ఆమె భావం. జాతిసాంకర్యం, భావసాంకర్యం నిరాఘాటంగా జరుగుతున్న ఈకాలంలో కళా సాంకర్యం కాగూడదంటే ఎలా ఆగుతుందో!

**సంస్కృత దినోత్సవం**

సురభారతి సమితి సెప్టెంబర్ 24 వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆవరణలో సంస్కృత దినోత్సవం జరిపినప్పుడు, సంస్కృతభాష ఏ ఒక్కరి సొమ్మూ కాదు; పారలౌకిక విషయాలను ఎంతగా సంస్కృత భాష చెప్పిందో, లౌకిక, వృత్తి విషయాలు అంత ప్రధానంగానే చెప్పింది; ఆధునిక

విజ్ఞానాది శాస్త్రాల పరిభాషకూ ఆ భాష అనుగుణమైనది; ఆనంద మాత్రాకాంక్షులకూ సంస్కృత సాహిత్యం ఆనందపు ఆమెతలిస్తుంది; అన్న విషయాలను పలువురు వక్తలు తెలిపారు. ఉత్సవం జరిగిన మూడు గంటలపాటూ శ్రోతలు ప్రాచీన నవీన వాతావరణాలలో విచిత్రానుభూతి పొందారు.

ఒక న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పస్వామి అధ్యక్షుడు; మరొక న్యాయమూర్తి శ్రీ గొల్లపూడి వెంకటరామశాస్త్రి ప్రధానాతిథి. పంచాయతీ రాజ్ శాఖ కార్యదర్శి శ్రీ శివరావ్ తమ ప్రసంగంలో సంస్కృత సాహిత్యం శాశ్వత తాత్కాలికానందాలు రెండింటికీ అపారమైన సామగ్రిని చేకూర్చగలిగిందని వివరించగా, 'సంస్కృత భాష ఒకవర్గం వారి వారసత్వం కాదు, విశ్వమానవుల స్వత్వం. అన్ని కులాలవారూ పూర్వం సంస్కృతంలో కవిత చెప్పినారు, గౌరవం పొందారు. హర్షుని ఆస్థానంలో మాతంగదివాకరుడనే హరిజనకవి బాణ మయూరులతో సమానంగా గౌరవం పొందాడు.

'అహో ప్రభావో వాగ్దేవ్యా.
యన్మాతంగ దివాకరః
శ్రీ హర్షస్య భవత్ సభ్యః
సమో బాణ మయూరయోః'

అని సమకాలకులు కీర్తించారు. 'నేడూ కాజీనజరుల్ ఇస్లాం వంటివారు సంస్కృతంలో మహా విద్వాంసులు' అన్నారు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి. ఆచార్య జి. జె. సోమయాజి సంస్కృత భాష దేశ సమైక్యాన్ని అనుదినమూ ప్రచారం చేసిందన్నారు. సమితి కార్యదర్శి డాక్టర్ శ్రీరామచంద్రుడు, డాక్టర్ ప్రమోద్

(63వ పేజీ చూడండి)



'టెరీన్'లో
ఎంత చక్కని డిజైన్లు,
నేతలు వస్తున్నాయో గమనించారా

అది కేవలం
అనూహ్యమైన
సంఘటన
మాత్రం
కాదు.


TERENE

# దేవీ పూజ

సంవత్సరంలో ముఖ్యమైన నవరాత్ర్యుత్సవాలు రెండు. మొదటి చైత్ర మాసంలో వసంతఋతువు ప్రారంభంతో ప్రారంభమయే వసంతనవరాత్ర్యుత్సవం. రెండవది మరి ఆరు నెలలకు ఆశ్వయుజ ప్రారంభంలో శరదృతువు ఆరంభంలో వచ్చే శరన్నవరాత్ర్యుత్సవం. వసంత నవరాత్రులలో విష్ణుదేవుని ఉత్సవాలు—ముఖ్యంగా శ్రీరామునిగురించిన ఉత్సవాలు జరుగుతాయి. శరన్నవరాత్రులలో శక్తి స్వరూపిణి అయిన దేవీపూజ ఎంతో నియమనిష్ఠలతో జరుగుతుంది. వసంత నవరాత్రులకు మరొక పేరు కాక వసంత నవరాత్రులనే పేరే ఉన్నది. కాని, శరన్నవరాత్రులకు దేవీనవరాత్రులనే పేరే మిక్కిలి ప్రసిద్ధంగా ఉంటున్నది. ఈ సమయంలో దేవీపూజకు ఉన్న ప్రాధాన్యాన్నిబట్టి ఈ పేరు ప్రసిద్ధమై ఉన్నది.

ఈ నవరాత్రుల్లో వరుసగా మూడేసి రోజులు లక్ష్మి, దుర్గా, సరస్వతీదేవుల పూజలు జరుగుతాయి. ముగ్గురు దేవతలూ ఆదిశక్తికి రూపాంతరాలే. అయినా దుర్గా దేవికే ఎక్కువ ప్రాధాన్యం. ఆమె రూపాంతరమైన లలితాదేవి పూజను తదుపాసకులు తొమ్మిది దినములూ ఎక్కువ నియమంతో ఆచరిస్తారు. పగలు ఉపవాసముండి రాత్రి దేవికి నైవేద్యం పెట్టినదానినే భుజిస్తారు. లలితాసహస్రనామపారాయణం, దీక్షగలవారు జపం విధిగా చేస్తారు. దుర్గాపూజకు దక్షిణభారతదేశంలో కంటె ఉత్తరాదిని ఎక్కువ ప్రాముఖ్యం ఉన్నది. కలకత్తా మున్నగు ప్రాంతాలలో దుర్గాపూజకోసం ప్రభుత్వ కార్యాలయాలకు కూడా సెలవులు (డి. పి. హాలిడేస్—అని ప్రసిద్ధి — అంటే దుర్గాపూజా హాలిడేస్—అని అర్థం.) ఇవ్వడం పరిపాటి.

ఇతర పర్వాలలో స్త్రీలు ఇతరదేవతలను పూజించడం అరుదు. స్త్రీదేవత అయిన దేవీపూజలో మహిళలు ఎక్కువగా పాల్గొంటారు. ఇది దీని ప్రత్యేకతకు ఒక నిదర్శనం:

'దుర్గాదేవిని పూజించుటవల్ల కలిగే ప్రయోజనం ఏమిటి?' అనే ప్రశ్న కలుగవచ్చును.

'దుఃఖదారిద్ర్యనాశాయ
సంగ్రామే విజయాయ చ,
క్రూరశత్రు వినాశార్థం
తథోగ్ర కర్మసాధనే,
దుర్గాంచ పూజయేద్ భక్త్యా
పరలోక సుఖాయ చ.'

అనేదానిలో పై ప్రశ్నకు సమాధానం ఉన్నది.

దుఃఖం, దారిద్ర్యం నశించాలన్నా, యుద్ధంలో విజయాన్ని సంపాదించాలన్నా, ప్రబలుడైన విరోధిని నశింపజేయాలన్నా, అసాధ్యమైన పనిని సాధించాలన్నా, విశేషించి పరలోకంలో సుఖాన్ని పొందాలన్నా భక్తితో దుర్గాదేవిని పూజించవలెను. ఆ దేవిని పూజిస్తే కోరిన కోరికలు నెరవేరుతాయి—అని దీని అభిప్రాయం.

తలచుకొన్న కార్యానికి విఘ్నం రాకుండా ఉండడానికి దేవతలు కూడా వినాయకుని పూజించక తప్పదు. ఆ విధంగానే తమ కార్యాలు నెరవేరడానికి ఆదిశక్తి అయిన దుర్గాదేవి ఆరాధన ఎంతో అవసరమై ఉండేది.

'ప్రథమం పూజితా సా చ
కృష్ణేన పరమాత్మనా,
బృందావనే చ సృష్ట్యాదౌ
గోలోకే రాసమండలే.
మధుకైటభ భీతేన
బ్రహ్మణా సా ద్వితీయతః,
త్రిపురప్రేషితే నేయం
తృతీయే త్రిపురారిణా,
భ్రష్టశ్రియా మహేంద్రేణ
శాపాద్దుర్వాససః పురా,
చతుర్థే పూజితా దేవీ
భక్త్యా భగవతీ సదా,
తథా మునీంద్రైః సిద్ధేంద్రైః






దేవైశ్చ మను మానవైః'.

అని బ్రహ్మ వైవర్తపురాణంలో ఉన్నది.

ఆదిశక్తి అయిన దేవియే సృష్టికి మూలప్రకృతి. మొట్టమొదట పరమాత్మ యైన కృష్ణుడు ఆమెను సృష్టికి మొదటనూ, గోలోకమందునూ, తర్వాత బృందావనంలోనూ, రాసమండలంలోనూ పూజించాడు.

మధుకైటభులనే రాక్షసుల బాధలు పడలేక భయంతో బ్రహ్మదేవుడు ఆ తర్వాత దుర్గాదేవిని పూజించి, వేడుకొన్నాడు. ఆమె అనుగ్రహించి, విష్ణుదేవుని ప్రోత్సహించి, వారిని సంహరింప జేసింది. ఇట్లు దేవీపూజ చేసినవారిలో బ్రహ్మ రెండవవాడయినాడు.

త్రిపురాసురులు దేవతలను లెక్కలేని బాధలుపెట్టగా, దేవతల ప్రోత్సాహంవల్ల శివుడు వాళ్లమీదికి వెళ్లాడు. వెళ్లేముందు దేవిని పూజింపబట్టే, ఆమె అనుగ్రహం వల్లనే వారిని సంహరించగలిగాడు. దేవిని ఆరాధించినవారిలో శివుడు మూడవవాడు.

దూర్వాసమహర్షి శాపంవల్ల దేవేంద్రుని సమస్త సంపదయూ సముద్రంలో కలిసిపోయింది. అప్పుడు దేవేంద్రుడు దేవిని మొరపెట్టుకోగా, అతని ప్రార్థనను మన్నించి, పోయిన సంపద మళ్లీ లభించేటట్లు చేసింది. ఇట్లు సభక్తికంగా దేవిని పూజించి, కృతార్థు లయినవారిలో ఇంద్రుడు నాల్గవవాడు. ఈ విధంగానే మునులూ, సిద్ధులూ, దేవతలూ, మనువు మున్నగు ప్రజాపతులూ, మనువువల్ల ఏర్పడిన మానవులూ —వీరందరూ దేవి అనుగ్రహానికి పాత్రులయినారు!

దుర్గాదేవిని గురించి బ్రహ్మవైవర్త పురాణంలో శ్రీ కృష్ణుడు ఇలా చెప్పి వట్లున్నది—

'ఆద్యా నారాయణీ శక్తిః
సృష్టిస్థిత్యంత కారిణీ,
యయా జగతి విశ్వం చ
యయా సృష్టిః ప్రజాయతే,
యయా వినా జగన్నాస్తి
మయా దత్తా శివాయ సా
దయా నిద్రా చ క్షుత్తృప్తిః
తృష్ణా శ్రద్ధా క్షమా ధృతిః,
తుష్టిః పుష్టిః తథా శాంతిః
లజ్జా శ్రీ దేవతా హి సా.'

నారాయణునివల్ల ఏర్పడిన శక్తియే మొట్ట మొదటిది. అదియే సృష్టి, స్థితి, సంహారములను ఒనర్చుచుండును. సృష్టి అంతయు ఈ శక్తివల్ల జరుగు చుండుట నిశ్చయము. ఈ శక్తి లేనియెడల లోకమే లేదని చెప్పవలసి యున్నది. ఈ శక్తినే నేను శివునకు సమర్పించితిని. దయ, నిద్ర, ఆకలి, తృప్తి, తృష్ణ, శ్రద్ధ; ఓరిమి. ధైర్యము, సంతుష్టి, పుష్టి, శాంతి, లజ్జ మున్నగువానికి అన్నింటికిని ఈమెయే అధిదేవత' అని ఈ శ్లోకాల అభిప్రాయం.

పూజా పద్ధతులలో మూడు విధా లున్నవి. అవి సాత్త్విక, రాజస, తామసములు. వీటిలో సాత్త్విక పద్ధతే చాలా ఉత్తమ మయినది.

'సాత్త్వికీ జపయజ్ఞైశ్చ
నైవేద్యైశ్చ నిరామిషైః,
మాహాత్మ్యం భగవత్యాశ్చ
పురాణాదిషు కీర్తనమ్,
పాఠస్తస్య జపః ప్రోక్తః
పఠేద్దేవీమనా స్తథా,
దేవీసూక్త జపశ్చైవ
యజ్ఞో వహ్నిషు తర్పణమ్.'

జపయజ్ఞం చెయ్యడం—అంటే ఎడ తెగకుండా జపం చెయ్యడం మాంసరహితా లయిన నైవేద్యాలు పెట్టడం సాత్త్విక పూజలో ప్రధానమైనవి. ఇలా పూజచేసి, దేవీభాగవతం మొదలైన పురాణాల్లో ఉండే దేవీ మాహాత్మ్యాన్ని కీర్తించాలి. దేవియందే నిశ్చలమైన మనస్సును వుంచి దాన్ని పఠించాలి. దేవీసూక్తాన్ని జపించి, హోమంచేసి, తర్పణం చెయ్యాలి. ఇలా చేస్తే దేవీ అనుగ్రహాన్ని పొందవచ్చును.

దేవీనామాన్ని సదా జపిస్తే కలిగే ఫలం ఏమిటంటే—

'దుర్గా దుర్గేతి దుర్గేతి
దుర్గానామ పరం మనుమ్,
యో జపేత్ సతతం చండి!
జీవన్ముక్తః స మానవః.'

'దుర్గా, దుర్గా, దుర్గా —అనే దుర్గా దేవినామమే గొప్ప మంత్రం, దానిని సతతమూ ఎవ్వరైతే జపిస్తారో వారు జీవన్ముక్తు లవుతారు. బు. వేం. ర. ●

# పండుగ నాడూ......



కృష్ణప్రియ

పండుగ పేరు చెప్పి బొమ్మల కోసం డబ్బు తగలబెడతావెందుకు? ఎంచక్కా ఆ రోజు మనం చూసిన బట్టల కొట్లో 'మోడలమ్మాయి కట్టిన లేతపచ్చ చీర కొనుక్కుని నువ్వు కూడా అలా....'

'అలా.... అంటూనే ఆ రోజు చూసిన నెమలి కన్నుల వన్నెలచీర సింగారించిన 'భామామణిని' వూహాగానంలో తలపుకి తెచ్చుకుంటున్న శ్రీవారిని నా చిన్నకళ్ళని పెద్దవి చేసుకు చూసేను. ఆ రోజు నేకొన్న వొక్క చీరే అయినా జాకెట్లు చాలా కొన్నాడాయన. నేనంతగా పట్టించుకోలేదు.

చీరెలను కట్టి వాటి అందాన్ని ఆ రకంగా ప్రదర్శించి— ప్రలోభపరిచే వర్తక ప్రముఖులకు, 'హోర్డ్సు!' 'కమీసను' ప్రదర్శనాలవయినా చూసి వూహాల్లో విహరించే పురుషపుంగవులు తమ భార్యల కోసం ఆ మాత్రం అందాల ఎన్నికకోసం కనులింతలు చేసి చూడగలందులకు!

'మా ఆయనెన్ని చెప్పే మాత్రం! పండగనాడూ.... పాత... అన్న మాటుపామెత నాధారం చేసుకుని. 'పండగనాడూ పాత బొమ్మల్తో కొలువేనా? చెప్పండి?' ... అనేసి ముందు జానకి ఇంటికి బయలుదేరాను. ఈరాత్రికి కొనకపోతే బొమ్మలు తీర్చేందుకు టయిమెక్కడ? 'జానకి మంచి కళాహృదయిని. కొత్త పోకడల పట్ల ఆసక్తి ఎక్కువ! హాల్లో అడుగుపెట్టిన నాకు వెస్ట్రన్ మ్యూజిక్కుకి అనుగుణంగా అడుగులు వేస్తున్న దాని నృత్యకౌశల్యం కనిపించింది.

'నొక్కునొక్కుల జుట్టు చెంపలమీద జీరాడుతుండగా మెడలో పూసలహారం లూజుచొక్కా మీద జారుతూంటే 'పేంటూ' పైజామాల—మధ్య అవతారాన్నొకదాన్ని ధరించి—ఆ పిల్ల కదిలినప్పుడల్లా తన యొక్క విశిష్టతను తెలియబర్చుతూంది. జానకిని మనసులోనే అభినందించేను. పిల్లల్ని మంచి 'మోడన్' డ్రస్సుల్లో కొత్తగా వుంచుతుందది.

'జానకి చాలా మారిపోతోంది సుమా? అనుకుంటూ దాని గదిలోకి వెళ్ళేను. నన్ను గమనించకుండా ఒక వారగా ఒరిగి నేలమీదున్న దేన్నో అందుకుంటూంది. మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళి భుజంమీద చెయ్యివేసేను.

'విసుగ్గా చూసిన ఆ చూపులు —?' బాప్ రే!...

'అది మా జానకి కాదు. దాని మొగుడు 'రాముడు' నన్ను చూసి నవ్వుతూ నిటారుగా నిల్చిన అతని భుజాల మీద కప్పుకున్న పువ్వుల వుత్తరీయం (దాన్ని నేనలాగే అనుకుంటాను) కిందపడింది.... 'బాగా పెరిగిన జుట్టు—మీద పువ్వుల బట్ట. అతను కట్టిన లుంగీ—చూసి వెల్తురులోంచి వచ్చిన నేను—క్రీనీడ నున్న అతన్ని 'జానకి' అనుకున్నందుకు— ఎవరూ నవ్వకండి!......

'అతను కట్టుకున్న లుంగా (సారీ!) మా జానకిదే. మరెవరైనా కాదనేందుకూడా వీల్లేదు. మచంతా ప్రింటుంటే దానికి ఇష్టమని నేనే అద్దించి యిచ్చేను



నా చేతులతో! కొలువు బొమ్మల మాట దేవుడెరుగు. నేనే బొమ్మలా నిలబడ్డాను.

'ఈసారి నా భుజాల మీద వద్దు చేతులు? జానకినే!'

నవ్వు దాచుకోలేక నవ్వుతున్న దాన్ని కళ్ళెర్రచేసి నోరు మూయించేసు.

'చాలా 'హాట్'గా వున్నావు గాని 'కూల్ డ్రింకు తాగి చల్లబడు.' అంటూ ఫ్రిజిడేర్ వయిపు అడుగులో అడుగేసుకుంటూ వెళ్తోంది. వాహ్! అదేదో అందాలు—అలంకరణల స్కూల్లో ఇదీ చేరిందేమో! ఫరవాలేదు— కంటి కింపుగా వుంది ఆ నడక.... అదీను.

మా ఆయన అటువంటి చీరకట్టు— అటువంటి నడక చూడ్డానికేగా, మూడుసార్లు నన్ను బట్టల కొట్టు కీడ్చుకెళ్ళేరు.

'తెల్లని జానకి ఒళ్ళు అసలు ప్రాంతం కన్నా మూడంగుళాల దిగువ ప్రారంభించబడిన చీరకట్టు. లావు సన్నాల ప్రదర్శన నిమిత్తం కూర్చబడిన 'పిన్నులబంధం!' పమిటని పిన్నుతో బంధించటానికి అవసరం గనుక, అలా అలా అంటిపెట్టుకున్న జాకెట్టు...... సుతారంగా సిల్కు చేతి రుమాలులా ఎడమ భుజం మీదుగా రెపరెపలాడే చిన్న పమిట, వీటిని చూస్తూ నేనూ తన్మయత్వ మయేను.....

అనవసరంగా మా ఆయన్ని ఆడిపోసుకున్నందుకు మనసులో చాలా నొచ్చుకున్నాను. 'పాపమరి! మా జానకి ఆ మాత్రపు అలంకరణకి ఎంత కాలం వినియోగించి వుంటుందో గ్రహించలేని పాపాయిని కాదుగా!... వాళ్ళాయన భుజాన్ని తాకి నేనేమంత బాధపడిపోలేదు. దానికి ప్రతిగా మరో వూహ నా మనసులో మెదిలింది. వచ్చినపని 'బొమ్మలు కొనటంలో జానకి సలహా తీసుకోవటం!' కాని విరమించుకున్నాను....

టీ తాగేటప్పుడు నా ఎదురుగా కూర్చున్న 'జానకి ముద్దుల బిడ్డలను చెప్పవెయ్యకనే చూసేను' మొదట నేను హాల్లో చూసిన 'ట్విస్టు' చేసే అమ్మాయికి నూనూగు మీసాలున్నాయి. మనసులోనే నన్ను నేను కోప్పడుకున్నాను. జానకి కొడుకు బుజ్జిబాబుకి బదులు దాని కూతురనుకున్నాను. 'ఒకవేళ పొరపాటున చీమ గనుక ఆ 'పేంటు'లో చిక్కి వుంటే వూపిరాడక చచ్చుట ఖాయం! అటువంటిది తొడుక్కుని —అది క్రాపూ కాదు— బాబ్—కాదు లాంటి కొత్తతరం తలకట్టుతో కూర్చున్న జానకి కూతురు 'వసంత' దంతం బొమ్మలా వుంది. (ఆడబొమ్మ నాగనుకోకండేం)

ఎక్కడో గోదావరి దగ్గర్లో మట్టి రోడ్ల వూర్లో పుట్టి పెరిగిన పల్లెపడుచు జానకి— పెళ్ళిచూపులకు వచ్చిన 'రాముడు' ఒళ్ళంతా కళ్ళు చేసుకు చూస్తున్న సంగతి గమనించుకుని పమిటకొంగుతో ఒళ్ళంతా కప్పుకుని సిగ్గుతో మెలికలు తిరిగిపోయిన సంగతి నాకు గుర్తు వస్తోంది.

'ఒసే జానకీ! మీ నలుగురూ పండగరోజు సాయంకాలం తప్పకుండా రావాలి సుమా! అన్నట్టు



# 10% నైజమైన తగ్గింపు ఈ దీపావళికొఱకై

సీతాకోకచిలుక యొక్క ప్రత్యేకమైన స్పర్శము మీకు వింత అనుభవమునిచ్చును.

క్రొత్త సేకరణ, అత్యాధునిక డిసైన్లు, విప్లవకరమైన రకములు ప్రతి కో-ఆప్ టెక్స్ షోరూమ్‌లోను వచ్చియున్నవి.

ప్రసిద్ధమైన కాంచీపురమ్, ఆరణి మరియు కుంభకోణమ్ సిల్కులు, ఉద్రేకపరచు వివిధ రకముల కాటన్ చీరలు, అత్యుత్తమమైన రెడిమేడ్ షర్టులు మరియు సిల్కు నాట్ స్టైలుకూడ ఉన్నవి

సీతాకోకచిలుక మీకై వేచియున్నది—దేశమంతటనూ ఉండు మూడువందల పైబడి విక్రయ విభాగములవద్దను.

10% నైజమైన రిబేటును సీతాకోకచిలుక మీకొసగుచున్నది.

(తమిళనాడు ప్రభుత్వము వహించును)
ఎన్. జి. ఓ.లకు కూడ దొరకును.

అక్టోబరు ఒకటినుండి నవంబరు 9, 1972 వరకు



## కో-ఆప్‌టెక్స్

చేనేత వస్త్రాలు

Criterion Co 2779 TE A

బొమ్మల కొలువేం కాదు. వూరికినే. మిమ్మల్ని ఇంటికి దిగబెట్టటానికి మేమొస్తాం!' అలా అని నచ్చచెప్పి ఇంట్లోంచి బయటపడ్డాను.

'అసలేమిటి? ప్రస్తుతం మనం ఎక్కడున్నాం? 'మహిషాసురవధ' దగ్గర కాదూ? అనిపించింది మనసులో'. ఐడియా! మా ఆయన నన్ను బొమ్మల కొలువొద్దని సాధించలా? ఆయనకి రాజకీయా లంటే మహా ఇది. అయితేనేం పాపం. చంద్రుడికి మచ్చున్నట్టు ఆయనకీ వేపకాయంత . . . . . .

మా ఆయన వాదనలో కాసింత ఇంటరెస్టు లాంటిది నాకు లేదన్న దిగులు ఆయన్ని కృంగదీస్తున్నది. కమలా'మణి' 'విమలా'వాణి వగైరాలున్న వీధిన పడ్డాను. బారులుతీరిన వనితా మణులు రకరకాల బొమ్మల్లా కనిపిస్తున్నారు నాకు. టెక్కుల్లైలు వాళ్ళు వాళ్ళ ప్రదర్శనని బొమ్మలకి మోడలమ్మాయిలకి మాత్రమే వినియోగిస్తున్నారు. కాని—పైన ఎండా, సూదుల్లాంటి పక్కచూపులూ మన మీద పడుతున్నాసరే....ఈ వళ్ళు మనదికాదు (కాస్సేపే) అనుకుని. . . . అలా నిలబడిపోతే? . . . .

'అయ్యారే! అజంతా ఎల్లోరాల రూపకల్పనలు! బర్మా—జపాను పడతులను సహితం మురిపించే బతివలు— వారి వారి చేతుల్లో! తామర పద్మాల్లా విచ్చుకునే 'చిత్ర' చామరాలు—హాహా! మనం ఏ యుగంలో వున్నాం? అసలు నేను కొనాలనుకున్న బొమ్మలూ?

'నా కనిపించిందప్పుడు — పండుగనాడూ పాత పేరంటాలేమిటని? మను మెరుగని యుగాల్లోను. నేడు మన ఎరుకలో జరిగిన కథల్ని మననం చేసుకుంటూ చేరుకున్నాను— 'మణిని, వాణిని' మరి విపుల నోరు విప్పితే హరికథాకాలక్షేపమే! మా ఆయన దానికోసం వో పేరుపెట్టేరు 'వాకీ—టాకీ డాల్' అని. అది నోరు విప్పిందంటే—నాటి రాతి

# పండుగనాడూ...

యుగం నుంచి—నేటి హిప్పీయుగం వరకూ— మాట్లాడగలదు. ఇంకా మాట్లాడితే ఇందిరాగాంధీయే సాక్షాత్తు ఆదిశక్తి అవతారమని — మధ్యలో మా ఆయనలాంటి వాళ్ళు లేచి అభ్యంతరం తెల్పబోతే 'మీరు కాస్త వోపిక పట్టండి సార్! ఫలాని సంవత్సరం— ఫలానా ఫలానా అలాఅలా అందుచేతే ఇది కరెక్టు'—అనేసి వింటున్న వాళ్ళచేతనే రెండున్నర గ్లాసులు నీళ్ళు తాగించేస్తుంది.

'జ్ఞానండీబాబూ! నాకూ గుర్తొస్తోంది. నోరూ వాయీ లేని బొమ్మల్ని కుక్కిన పేనుల్లా కూర్చోబెట్టి—వాటికి మంగళహారతులు—పప్పుబెల్లాలు పెట్టి ఆనక వాటిని జాగ్రత్త పెట్టలేక. . . . అయ్యో!. . ఇంకేం చెప్పేది? పగిలిపోయినబొమ్మల్ని మాసుకుని నేనెన్ని వందలసార్లు బాధపడి వుంటానని?' 'అత్త కొట్టినందుకు కాదు — తోటికోడలు దెప్పినందుకున్నట్టు' అసలే బొమ్మలు పగిలి మానసికంగా బాధపడేనన్ను

'వెధవ బొమ్మల కోసం ఇంత రభసేమిటి మరిచిపో!' అనేసి తీసిపారేసే మా ఆయనమాటలో?

అందర్నీ అన్ని రకాల వంకలతోనూ పండగనాటి సాయంకాలానికి మా ఇంటికి చేరుకునేలా ఏర్పాటు చేసేను. నేను నిన్నంతా వూహించుకున్న ఈ తరం కొత్త బొమ్మల కొలువు. నా కళ్ళముందు మెదిలింది. 'జీవకళ అలరారే నా బొమ్మల కొలువు' చూస్తే — మా ఆయనకి నాల్గు గ్లాసుల మంచినీళ్ళు అందించే ఖర్మ పడుతుంది నాకు. అంచేత ఆ రోజు పొద్దున్నే —పెద్ద నీళ్ళ బిందె ొకదాన్ని మా సమావేశపు గదిలో వుంచదలిచేను.

ఆలోచనల్తో పాటు... కాలి నడక జోరుగా సాగిపోతూన్న సమయంలో — 'ఎవరదీ? కాస్త నాగరికత నేర్చి వైజాగు అప్పలనరసమ్మలా వుంది.' ఆవిడ దండకడియంతో కాస్త షెకిచ్చింది నాకు!

'కానుకుని పోయే అమ్మ!' అనాలని నోరు తెరిచేను.

'హలో కసీ! హవ్ ఆర్ యూ!' అంటూ కౌగలించేసుకుని. . . . ఇంకేం ప్రాయను ఇప్పటి ఫేషన్లతోపాటు అదీ. . . .

నల్లని కబరీ భరంలో కల్లుముంతకి తీసిపోని కొప్పు. తామరకాడల్లాంటి చేతులకు మోటుగా వున్న 'సువర్ణకంకణాలు', చక్కటి అంచుల మినీశారీ! అంచుల్ని వళ్ళు మిట్టాన్తి కనిపించేట్లుగా చుట్టిన పద్ధతిలో నడిచేందుకు కాస్త యిబ్బందిగా వున్నా (చూసేవాళ్ళకి వయ్యారమనిపిస్తుంది) అంత కష్టపడి కట్టిన 'కనకమహాలక్ష్మి'ని చూసి చిత్తైపోయేను. అప్పుడెప్పుడో అది కాలేజీ డ్రామాలో వెంకి వేషం వేసింది గనుక—ఇప్పుడీ వేషంలో గుర్తుపట్టగల్గేను.




ఆధునిక వేషధారణ మా టెలావున్నా కనకమహాలక్ష్మి తన ప్రాంతీయ వేషధారణని ఆమోదంతో స్వీకరించటం నేను మెచ్చేను. నేను ఒకప్పుడు తన మీదల్లిన కవిత్వానికింకా మైమరిచే వున్న కనకమహాలక్ష్మి కాదనకుండా నా ఆహ్వానాన్నందుకుంది.

విజయం సాధించిన వీరనారిలా మా ఇంట అడుగుపెట్టేను. పండుగనాటి మా ఇంట జరగబోయే పలురకాల అలంకార ప్రదర్శనను గూర్చి— గోరంతలు కొండంత చేసి చెప్పాలని ప్రవేశించేను శ్రీవారి గదిలోకి.

'అర్రరే. . . . అదేమిటి?. . .అవి. . . అవి నా జాకెట్ గుడ్డలు కావా?'

'ఏమండోయ్, మిమ్మల్నే!' . . . . ఈ మొగుళ్ళెప్పుడూ ఇంతే కదా!. . . . . .

'ఇదిగో చూడు. . . .నిన్నే! ఏమిటలా చూస్తావ్! డ్రెస్సెలా వుంది?. . . .'

'మూడుసార్లు బట్టల కొట్టు కెడ్తుకెళ్ళి, దసరా బొమ్మలొద్దనేసి? ఈ కాలక్షేపమన్ని చెడామడా ఆడిపోసుకుని?' . . . సరే జవాబివ్వాలిగా మరి. . . .

'ఎలాగో వుంది! ఈ కాలానికి సరిపడినట్టుంది! రేపటి మనింట్లో జరిగే వస్త్ర ప్రదర్శనలా వుంది! మోడరన్ ఆర్టులో (బహుమతి పొందిన) అర్థంకాని రూపంలా వుంది! ఇంకా చెప్పాలంటే ...వేరు లేని రంగులా వుంది. నా కథలమీద మీరు చెప్పే అభిప్రాయంలా వుంది!. . . . 'అనేసేను—అనర్గళంగా

మరి అందరూ అన్ని పేషన్లలోనూ —ఆధునిక వస్త్రధారులై అవతరిస్తారు. మరి నేనూ? బొమ్మల కొలువులో బొమ్మలెన్నెన్నున్నా, అమ్మనారి రూపం కావాలిగా! 'ఐడియా!' లాకర్‌లో నగలూ అత్త వారిచ్చిన పట్టుచీరా. . . . ఇవన్నీ ధరిస్తే— నేనే సాక్షాత్తూ అమ్మవారిలా ...... ( వేషముండోయ్! ) . . . . . .ఫరవాలేదు. నా బొమ్మల కొలువుని జీవకళతో తీర్చిదిద్దగలుగుతున్నాను.

# అవును, యిది నిజం!

## రూబీ డస్ట్ టీ విజయ సాధన విూవంటి ప్రజాబాహుళ్యమునకే చెందును.

రూబీ డస్ట్: విలువయిన రుచి, యింపైన రంగు, వెను వెంటనే యిచ్చే ఆహ్లాదము; ఇతర డస్ట్ టీలలోకల్లా ఎన్నో ఎక్కువ కప్పుల టీ.

# లిప్టన్ రూబీ డస్ట్

డస్ట్ టీలలో చక్రవర్తి

ప్యాకెట్లలోనున్న
టీ మాత్రమే
తాజాదనము,
సువాసన
నిచ్చును

LIPTON

లిప్టన్స్
అంటే
మంచిటీ
























**వి.ఎస్. పి. కోటబొమ్మాళిపేట, (ఒరిస్సా)**

రామలక్ష్మిగారూ బి. యి. చదువుతున్న వ్యక్తి భిక్షాటన చేస్తున్నాడు. చూశారా? మనదేశ పురోగమనం?

యింకా నయం. భిక్షాటనం నిషేధిస్తే?!

**కె. బి, సి, వడమ|గానుం**

మనదేశం నారీమణులకు ఉన్నతమైన పదవులనిచ్చి, గౌరవించి ప్రపంచమునకు మార్గదర్శకమైనది. యింకా మహిళలు సమానత్వాన్నికోరడంలో అర్థం ఏమిటి?

దేశం గౌరవించింది సరే. మీరేం చేస్తున్నారు? అది కూడా ముఖ్యం!

**ఒక అభిమాని, ఆలూరు**

మీ జవాబులనుపట్టి చూస్తే 'అన్నిటికన్న యితరులకు సలహాలు చెప్పడం చాల తేలిక' అనే నానుడి సార్థకం అయినట్టు తోస్తుంది. 'వివాహానికి చిహ్నంగా మాంగల్యాలు లేవు'అని నమ్మలేని విధంగా జవాబిచ్చారు. అబద్ధం చెప్పినా నమ్మేలా వుండాలి.

చిత్తం. మీ నీతిబోధ తల కెక్కింది. కాని—అడగక యిచ్చిన సలహాకి విలువలేదనీ, నిజం దాచక చెప్పేస్తే మీలాంటి అల్పులు నమ్మలేరనీ—నాకూ తెలిసింది!!

**రమణ, 56 ఎ. పి, ఓ**

రామలక్ష్మిగారూ నేటి ప్రపంచంలో ఫాషన్ రోజురోజుకి పెరిగిపోతూ ఇంచుమించుగా మీ ఆడవాళ్ళు అంతా మూడు వంతులు నగ్నంగా తయారవుతున్నారు. స్త్రీకి సిగ్గే సింగారం అంటారు కాని మీ ఆడవారు చేస్తున్న భరించలేని ఈ ఫాషనులు అరికట్టబడనా?

మారే ఫాషనులను పట్టుకుని యింత బాధపడ్డం ఎందుకో నాకు అర్థం కాదు. నిన్న చేతుల్లేని రవికలు. ఈ రోజు జబ్బారవికెలు. నిన్న పొట్టి స్కర్టులు. నేడు నేలజీరాడే పరికిణీలు. నిన్న ఒంటికి హత్తుకుపోయే బట్టలు. నేడు ఎంత లూజంటే అంత వాగ్. యింత క్షణాలమీద మారిపోతున్నాయి— నాగరికుల దుస్తులు. మీరూ నేనూ తల బాదుకునేలోగానే మారిపోయే వీటికేహో—నైతిక పతనానికి నాంది అనో, సిగ్గులేనితనానికి చిహ్నమనో అనుకోవడం— మన లేని ఓర్పుకి నిదర్శన. పట్టించుకోకుండా వుంటే పోయే విషయాలపట్ల యింత పట్టుదలగా వుంటే మీరు యితర విషయాలలో ఎందుకుండరనిపిస్తుంది నాకు.

**వి. ఏ. ఆర్, సోడం**

ఇలా పెరుగుతున్న మానవాళియొక్క శాస్త్రవిజ్ఞానం విశ్వశాంతికి దోహదం చేస్తోందంటారా?




తప్పక. ఈలోగా మారణాయుధాల ఉత్పత్తి పిచ్చికి ప్రథమస్థానం యివ్వక పోతే.

**కాసుల్రావు, సునీత, పరకాల**

మీకు స్వీయచరిత్రలాంటిది వుందా? మీ చరిత్ర చదవాలనివుంది. ఎలా?

లాభంలేదు. యింకా ఎవరూ నా జీవితచరిత్ర రాయడానికి పూనుకోలేదు. ఏం చెయ్యను?

**ఎ. టి, పెనుగొండ**

యావండి రామలక్ష్మిగారూ, మీ రిచ్చే సమాధానాలు నేనిస్తే బాగుంటుంది అంటున్నాను. మీ ఉద్దేశ్యం?

నా ఉద్దేశ్యానికేం గాని సంపాదకుల ఉద్దేశ్యం కూడా కనుక్కొని చూడు తాతాలూ.

**జి. ఆర్. ఎమ్, మద్రాసు.**

చిట్టితల్లి మీ ఊత పదమా?

కాదు— ఆడపిల్లల నెక్క నా ముద్దుమాట.

'ప్రేమించు ప్రేమకై' తరవాత ఏం రాశారు?

ఏం రాయలేదు.

**ఎస్. ఐ. ఆర్, షోలీబంకే**

'1972 అక్టోబరు 13న ప్రళయం జరుగుతుంది. ఆరోజు సూర్యుడు వుదయించడు. మూడురోజుల్లో ప్రపంచం సర్వనాశనం అవుతుంది' అనే వార్త చదివారా! ఇది ఎంతవరకు నిజం?

చదివాను. ఆ ప్రళయంలోగా నా సరదాలన్నీ తీర్చేసుకునే తొందరలో— ఆ వార్త నిజానిజాలు ఎవరినీ అడగలేదు సోదరీ!!

**ఎ ఎస్, పెద్దపల్లి**

భర్తలను లెక్కచేయకుండా మాట్లాడే భార్యలను ఏమనాలి?

లెక్కచెప్పి మాట్లాడమనాలి. (అంటే ఏం లేదు. ఎందుకు మాట్లాడుతున్నారో — అర్థమయేలా మాట్లాడమనాలి) — నసక్కుండా.

**కె. జి, కాకినాడ**

విధి, విధివ్రాత అంటారే ఆ విధి అంటే ఏమిటి?

అదృశ్యంగావుండే మన అవకాశాల వ్యాప్తి విధి. అది కాలం గడవను—బయట నడుతూ వుంటుంది.

**కె. వి, కొయ్యలగూడెం**

ఇది జరుగదు అని తెలిసినా మనిషి తన జీవితంలో ఏవేవో వూహిస్తూ అందమైన తీపి కలలు కంటూ వుంటాడు. ఎందువల్ల?

ఆశాజీవి కనుక. ఆ ఆశలే లేకపోతే మనిషి ఒక్క క్షణం బ్రతకలేడు.

**డి. ఎస్. ఆర్, నరసారావుపేట**

'ఒక గుర్రంమీదా ఒకరు మాత్రమే ముందు కూర్చుని నడుపకలరు. ఇద్దరూ ముందు కూర్చోడం అన్నది జరుగదు. కూర్చోగలమని ఎవరేనా అనుకుంటే అది తెలివితక్కువ' అన్నారు జాన్సన్. ఈ వాక్యం మీరు వినలేదా. వినకపోతే మీ కర్మ. వినికూడా సమాన హక్కులకోసం కేకలు వేస్తున్నారా, అది మీ మూర్ఖత్వానికి నిదర్శనం,

చిత్తం మీ జాన్సన్ కోట్ బాగానే వుంది. కాని ఏం కొంతకాలం వెనక్కి దిగండి మీరు మేం తోలుతాం గుర్రాన్ని!! ఏం యిలా అడిగితే బాధగా వుందా.....? మీలాంటివారి ఉడుకుబోతుతనంతో—అసలు సమానత్వపు అర్థానికి వికృత రూపం వస్తూంది—నిజంగా అది మా కర్మే!! ఏమంటారు?

**కళావతి, శాసనకోట, హిందూపురం**

కె. రా. గారూ వరుడు వధువునుండి గొప్పగా తీసుకొన్నకట్నం పెళ్ళి పత్రికలో వేయించరు ఎందుకు?

నీ ప్రశ్న నాకు నచ్చింది కళావతి. 'బహుమతులు వద్దు!' అంటూ వేసేదంటే 'కట్నం ఇంత' అని వేస్తే బాగుంటుంది. కాని అది దొంగ డబ్బు—ఎలా చెప్తారు?!

**పి. వి. ఆర్, అత్తిలి**

నేను ఒక అమ్మాయిని అక్కగా మాత్రమే ప్రేమించాను. ఆ అక్క నేనూ యిష్టంగా వుంటాము. కాని మా అక్క తమ్ముళ్ళను చూసి కొంతమంది ఓర్వలేక పోతున్నారు. ఎందుచేతనండి ?

ఎంత అమాయకుడివి రాఘవులూ, ఓర్వలేకపోడానికి—నీలాంటి తమ్ముడో, నీకు ఉన్న అక్కలాంటి అక్కో ఆ కొందరికి లేకపోవడమే!!

# అనామధేయుడి ఆత్మకథ

## సీరియస్నెస్ హాస్యరచన — ఆర్వియ

## 12

'పాడు!'—'పాడు!!'—'పాడు!!!' అన్న గావు కేకలో స్టేజి దద్దరిల్లింది. అసలే చెడిపోయిన బుర్ర — దాంతో 'నేను మరి పనిచెయ్యను' అని స్ట్రయిక్ నోటీసు జారీ చేసింది. వాళ్ళ ఉద్దేశం ఏమిటో మరి నాకు సుస్పష్టంగా అర్థం కాలేదు. 'పాడు—పాడు' అని పద్యం పాడమంటున్నారో, లేక, 'పాడు పాడు' అని నాటకం పాడై పోయింది అంటున్నారో ఒక పట్టాన బోధపడలేదు. మొదటే బుర్ర లేనట్టు కనబడింది. తరువాత కొంచెం చెడిపోయింది దానా దీనా. ప్రేక్షకుల ఘోషతో అసలే పాడై పోయింది, ఈ 'పాడు' 'పాడు' తో బుర్ర పూర్తిగా పాడయిపోయి వూరుకుంది... అంతలో తెలివి తెచ్చుకొని, ధైర్యం వహించిన వాడనై నా పోర్షను ప్రారంభించేను:

"దూర్వాసునస్త్రంబు......
దూర్వాసునస్త్రంబు......
దూర్వాసునస్త్రంబు......"

నాకు ముందు ముక్క ఎంత బుర్ర కొట్టుకున్నా అర్థం కాలే. 'వన్స్‌మోర్' 'గో ఆన్' 'కానీ' — అన్న ప్రళయకాల పర్జన్య ఘోషలో నా చెవులు చిల్లులు పడి, నోరు మూతపడిపోయింది. ఆ ప్రాంప్టరుగాడికి బుర్రా బుద్ధీ అన్నవి వుండాలా? ముందు ముక్క అందివ్వాలా? మరేం చేస్తాను. "భయము కలదే?" అన్న ఆఖరి ముక్క భయభ్రాంతుడినై అనేసి, లోపలికి మెఱుపులా జారుకున్నాను.

తెర అవతలి భాగోతం యిలా ఏడిస్తే, తెర లోపలి భాగోతం సరేసరి. ఈ లోపలి భాగోతం చూసి నాకు మరీ ఒళ్ళు మండింది. నన్ను చూసి ఆ ప్రాంప్టర్ రాస్కెల్‌గాడు ఒకటే నవ్వు. మొగుడు కొట్టేడంటే పడొచ్చు కాని తోటికోడలు చూస్తే భరించడం కష్టం. అలాగే ఆడియన్స్ అల్లరి పెట్టేరంటే ఒక దారి, కాని 'మన' వాళ్ళు అని అనుకుంటున్న వాళ్ళు కూడా నవ్వితే కోపం రాదుటండీ? 'ఏమిరా మై డియర్ రాస్కెల్! అప్రాచ్యుడా! ముందు ముక్క అందించేవు కానేం??' అని గర్జించేను.

"నాకు నవ్వులో నోట్లోంచి మాట వూడిపడంది కాదురా భాయ్!" అని యింకా తెగ నవ్వుతూనే వున్నాడు. వాడి నవ్వులు చూసి మిగతా వాళ్ళు నవ్వులు లంకించుకున్నారు. నవ్వు ఒక అంటుజాడ్యం లాంటిది. ఇట్టే పక్కవాడిని అంటుకుంటుంది. ఒకడు ఎందుకో నవ్వుతున్నాడనుకోండి. పక్కవాళ్ళకి కారణం తెలియక్కర్లేదు. వీళ్ళూ నవ్వుతారు. ఇలాగ ఒకరిని చూసి మరొకరు నవ్వుతున్నా వాళ్ళందరి ముఖాలూ ఏడుస్తూన్నట్టు వికారంగా కనిపించేయి నాకు. నవ్వుతున్నామనుకుంటూ ఏడుపు మొహాలు పెట్టిన వాళ్ళ 'మొహాలు' చూసి—నిజంగా ఏడుస్తూన్న వాడిని నాకు నవ్వు వచ్చేసింది!

"అయితే, ఆ స్టేజ్‌ఫియర్ (సభా కంపం) నీకు ఇంకా వుందా?" అంటారేమో! నో ఫియర్—దాన్ని జయించాలని ఆ క్షణమందే దీక్షాకంకణం కట్టుకున్నాను. పన్నయ్యానికి బంగారు కంకణం దొరక్క పోవడంచేత దారప్పోగు దక్షిణ హస్తానికి కట్టుకున్నాను. ఆ కట్టిన దుర్ముహూర్తం ఎలాంటిదో గాని, అలాగే అత్యద్భుతంగా జయించితీరేనని చెప్పడానికి నేను చాలా గర్విస్తున్నాను.

దానికోసం కొందరు బైరాగుల్ని ఆశ్రయించి బైరాగి చిట్కాలు సంపాదించేను. కొందరు వర్తకుల్ని ఆశ్రయించి 'ట్రేడ్ సీక్రెట్' నాబడు వ్యాపార రహస్యాలను గ్రహించేను. కొందరు పరమహంసలవద్ద తత్వోపదేశం పొంది, కొన్ని పరమ రహస్యాల్ని హస్తగతం చేసుకున్నాను. కొందరు సుప్రసిద్ధ అనుభవవేత్తలను అనుసరించి అమూల్యానుభవాల్ని ఆకళింపు చేసుకున్నాను.

ఏమిటయ్యా, ఆ చిదంబర రహస్యం?

ఇది మహా ఏకాంత రహస్యం. మరి ఎవరికీ చెప్పకండి. ఇది మన మధ్యనే అణగారి పోవలసిన అత్యంత అమూల్య రహస్యం!

ఇక చిత్తగించండి!!

స్టేజి ఎక్కగానే ప్రేక్షకులు అనే వస్తువు అక్కడ లేదు అనుకోవడం; కేవలం కుర్చీలు బెంచీలు మాత్రమే ఉన్నాయనుకోడం! అలా అనుకోవడం వల్ల కలిగే లాభాలేమిటంటే— అవాకులూ చెవాకులూ పేలినా కుర్చీలు బెంచీలు వినవు గదా! అథవా విన్నా అవి వాటికి అర్థం కావు గదా! కనీసం అర్థం అయినా తిరగబడవు గదా! అంచేత ధైర్యంతో మాట్లాడవచ్చు!

అప్పటికీ నోటంట మాట పెగలదనుకోండి. గుండెకి చేతులు రాసుకొని, పూర్వం నాగాస్త్ర గరుడాస్త్రాల్లా — ఇప్పుడు అటంబాంబు హైడ్రోజన్

జొరబుల్లో — గబగబ కొట్టుకుంటూ యుద్ధం చేస్తూన్న, గుండెకాయలకి 'ఏక్ విరంజన్' అని ధైర్యం చెబుతూ మంత్రో పదేశం చెయ్యడం. 'నేను నిజం' 'ఆడి యెమ్మ మిథ్య' అని మనస్సుకి వేదాంతోప దేశం చెయ్యడం. తరువాత—

'పలుకుటకు నేనెవండును?
పలికించుట కంతకన్న ప్రజలెవ్వరు? నే
బలుకుట సర్వము మిథ్యయె
పలికించుట, పలుకు వినుట, పలుకుట
వాడే!'

అంటూ 'వాడి' స్మరణ చేసుకోవడం!

ఇంకా ఈ వేదాంత ధోరణిలో పడ్డా కూడా 'భయావంకం' వదలకపోతే ఒక్క మారు గుర్రంలాగ సకిలించి గాడిదలాగ ఒక తుమ్ము తుమ్మి, నాలికతో పెదవులు తడుపుకొని 'జై పాతాళభైరవీ!' అని వెంటనే ప్రారంభించడం!

మరీ యింకా సర్దుకోకపోతే ఘాట్టిగా ఒక నిమిషం కళ్ళు మూసుకోవడం. అది చూసి ప్రేక్షకులు — 'నటుడు ప్రార్థన చేసుకుంటున్నాడు కాబోలు, చాలా దైవ భక్తుడిలా వున్నాడు' అనుకుంటారు. మనలో ఏవైనా పొరపాట్లుంటె చిన్నకారు అల్లరి పెట్టినా, పెద్దవాళ్ళూ, పెద్ద వాళ్ళం అనుకుంటూన్నవాళ్ళూ — మన జోలికి రారు!

నేను యిలాగే అభ్యాసం చేసి, బైరాగి చిట్కాలువేసి, తత్వోపదేశం పొంది, చచ్చి చెడి చాయం గల విన్నపాలవి 'స్టేజిఫియరు' 'భయావంకం' 'సభాకంపం' అని వివిధ సమయాలలో వేరు వేరు ప్రజల చేత పిలువబడే 'రంగస్థలకంపరోగ నివారణ' చేసుకుని బయటపడ్డానని తెలియజేసుకొనే సంతోషంతో ఉక్కిరి బిక్కిరౌతున్నానని తెలియజేయడానికి చాలా సంతసిస్తున్నాను.

* * *

ఈ విధంగా అడపా దడపా నాటకాలు వేస్తూ వచ్చాము. ఒక్కొక్క నాటకం కన్నా ఆ నాటకంలో జరిగే అంతర్నాటకాలే ప్రేక్ష కుల్ని విశేషంగా ఆకర్షించేది.

అప్పట్లో మాకు సీనులూ, చమ్కీ, కోటులూ, అట్టకిరీటాలూ, క్రరకత్తులూ, పూసల పేర్లూ వగైరా ఆహార్య సామగ్రి ఇంకా సమకూడలేదు. అసలు ఆ ఆహార్య

## అనామధేయుండి ...

సామగ్రి లేకే నా నారదుడి వేషం సగం తగ లడింది. అందుచేత బ్రహ్మాండమైన సెట్టింగులతో, అద్భుతమైన ఆహార్యాలతో గొప్ప నాటకం ఆడేయాలని సంకల్పించుకున్నాం. కాని వీటిని కొనడానికి తగినంత ధనం జతపడలేదు. మావాళ్ళున్నారే—ఉత్సాహం ఎంతైనా ఒలకబోస్తారు, ఒక్క పైసాయేనా వదలరు. ఏమిటి సాధనం? ఇంగ్లీషువాడు చెప్పినట్లు మూడే సాధనాలున్నాయి. 'టు బెగ్, బారో ఆర్ స్టీల్' (అపహరించుము, యాచించు, అరువు తెమ్ము!) చెయ్యి చాచడం, హస్తలాఘవం చేతకానివాళ్ళు ఎరువేనా తెచ్చుకోవాలి!

ఇంతలో ఒక భోగట్టా తెలిసింది. ఒకప్పుడు బాగా మోతుబర్తై, ఇప్పుడు చితికి పోయి, ఆ ఒకప్పుడు బాగా నాటకాలు వేసి—వేయించి చేతి చమురు వదుల్చుకొని ఇప్పుడు పాతస్మృతులలో మైమరచి మురుస్తూన్న ఒకానొక రెడ్డి పంతులుగారి వద్ద మిద్దెలో ఈ బాపతు సామగ్రి అఘోరిస్తూ వున్నదని తెలిసింది. వెంటనే వాటిని అడిగి తేడానికి మనుషుల్ని పంపించేము. కాని, డోలాందోళనాయత్తచిత్తములతో తికమక పడుతున్నాం.

'ఇంత బాధ ఎందుకయ్యా?' అంటే, చెప్తా వినండి. నాటకం వేసే రోజు యింకా రెండురోజులే వుంది. ఇక, మా వూరికి ఆ వూరు 'పదికోసుల రస్తా'. పది కోసుల దూరంలో వుంటే రెండు రోజుల్లో రాలేరా? దానికింత తికమక పడటం దేనికి— అని అడగండి. ఆ వూరికి చుట్టుప్రక్కల రైలు స్టేషన్ లేదు. చుట్టూరా అడవి మాత్రం వుంది. ఆ వూరికి దగ్గరగా వున్న స్టేషన్ ఎనిమిది కోసుల దూరంలో వుంది. స్టేషన్ నుంచి రోడ్డు మూడు కోసులే వుంది. అంతవరకే బస్సు వెళ్తుంది. అక్కడినుంచి కాటి దారి. ఎండ్లబండి తప్ప మరొకటి లాభం లేదు. అందులో అడవి. అది చాల నట్టు—ఆ వూరికి ప్రపంచానికీ అడ్డంగా కందకం లాగ ఒక ఏరు. ఎండా కాలంలో వెనక్కి తగ్గినా వర్షాకాలంలో దాని జోరు మహా లావు! అప్పుడు ఎవడ్నో గుహుడిలాంటి వాడిని పట్టుకొని పడవల్తో దాన్ని తరించాలి. ఇక మా నాటకం గణేశ చతుర్థి నాడు వేస్తున్నదాయెను. అసలు, కొందరు అన్నారు లెండి. 'చవితినాడు ఏ పనీ చెయ్యకూడదు. నాటకం ఎందుకు వేస్తున్నార్రా? అని!' 'చవితినాడు పూజ చేయటం మానే శామా? పిండివంటలు తినడం మానేశామా? కొత్తబట్టలు కట్టుకోవడం మానేశామా?' అని సవాలు చేశారు మరి కొందరు. 'సీకర్మ' అన్నారు పూర్వులు—అంటే పూర్వం ఉదహరించబడ్డ వారు. 'సడేలే' అన్నారు అనంతరులు—అంటే అనంతరం చెప్పబడిన వారు.

దానికి తోడు పులిమీద పుట్రలా మాంచి వర్షాకాలం. ఇండియా నుంచి ఇంగ్లండ్‌కి కొన్ని గంటల్లో విమానంలో ఎగిరి పోవొచ్చు. కాని, ఆ వూరికి మాత్రం వర్షాకాలంలో వెళదామని అనకూడదు. ఎవరైనా పొరబాటున అన్నా వినకూడదు. ఆ సంగతి తర్వాత తెలిసిందనుకోండి.

విఘ్ననాథుడే అన్నిటికి వున్నాడని అతని మీదే భారంవేసి కూర్చున్నాం ... వేసే నాటకం కురుక్షేత్రం. నాటకం నాటి సాయంకాలం వరకూ ఆ వెళ్ళిన ఇద్దరు పెద్ద మనుష్యుల అజాపజా తెలియలేదు. ఏ వేళకేనా రాకపోతారా?—అన్న ధైర్యంతో నాటకానికి అన్ని ఏర్పాటులూ చేసి, దిగాలు మని కూర్చున్నాము. అన్ని ఏర్పాటులూ— అంటే ఆహార్య సామగ్రి మినహా! వేష ధారులు రంగు పులుముకొని రెడీగా వున్నారు. చమ్కీ కోటులూ, అట్ట కిరీటాలూ రాగానే ధరించి రంగంలోకి దుమికేస్తారు. స్టేజి తయారుగా వుంది — స్తంభాలూ లైట్లూ వగైరాల్తో. ఇక సీనులు రాగానే అమాంతంగా కట్టెయ్యడమే! సభికులంతా కూడా వొచ్చి మహా ఉత్కంఠతో ఎదురు చూస్తున్నారు.

(ఇంకా వుంది)

మేషం: సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగు తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

వృషభం: మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

మిథునం: అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుటాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

కర్కాటకం: వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన విషయాలను తెల్సు కొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

సింహం: కొన్ని వ్యవహారాల్లో ప్రయాస మీది ప్రయోజనం మరొకరిది కావచ్చును. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం పెరుగు తుంది. రావలసిన డబ్బు సమయానికి అందు తుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

కన్య: భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. పోటీ వారిలో గౌరవం లభిస్తుంది.

తుల: వృత్తిలో పోటీవారి పోటీ పెరుగు తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సు కొంటారు. సమయానికి యేదో ఒకవిధంగా

# వారఫలం

**20-10-1972 శుక్రవారం మొదలు**

**26-10-1972 గురువారం వరకు**

డబ్బు చేతికి వస్తుంది. వారం ఆఖరులో వ్యతిరేక పరిస్థితి యేర్పడు తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

వృశ్చికం: వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

ధనుస్సు: మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును.

స్త్రీలకు:— దైవకార్యాలు నెరవేరతాయి. నూతన విషయాలను తెల్సు కొంటారు.

మకరం: వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. బంధుమిత్రులను కల్సు కొంటారు.

కుంభం: మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో పోటీ వారి పోటీ తగ్గుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనుకూల వార్తలను వింటారు.

మీనం: వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందు తుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

—మహేష్




**జరిగిన కథ**

రామ్మూర్తికి ఇద్దరు కొడుకులూ, ఒక కుమార్తె. పెద్దవాడు ప్రసాద్ ఉద్యోగం చేస్తున్నాడు. రెండవ వాడు కొంచెం అల్లరిచిల్లరగా తిరుగుతుంటాడు. కుమార్తె లక్ష్మి పెళ్ళికి ఎదిగి వుంది. భార్య శాంతమ్మ రోగిష్టిది. కాంచన ప్రసాద్ ఆఫీసులోనే పని చేస్తున్నది. ప్రసాద్ కాంచనా ప్రేమలో పడ్డారు. అందుచేత తండ్రి తెచ్చిన సంబంధానికి ప్రసాద్ ఇష్టపడలేదు.

## 3

విమలను వివాహం చేసికొమ్మని తండ్రి చెప్పిన మాటనుగురించి ప్రసాద్ మొదట కొంచెం ఆలోచించేవాడు కాని ఆఫీసులో కాంచనను చూడగానే అతను పూర్తిగా తండ్రిమాటను మరచిపోయేవాడు. ప్రసాద్‌కు క్రమంగా కాంచనయెడల అనురక్తి అధికం అవుతూ వచ్చింది.

కాంచనను చూస్తుంటే, ప్రసాద్‌కు యేదో దేవలోకంలో విహరిస్తున్నట్లుగా ఉండేది. ఆమెతో మాట్లాడుతూ ఉంటే ప్రసాద్ తనను తానే మరచిపోయేవాడు. కాంచనతో యెన్నో విషయాలు మాట్లాడాలని ప్రసాద్ అనుకొంటుండేవాడు కాని యేమిటి మాట్లాడాలో అతనికి తెలిసేది కాదు.

కాంచనకూడా ప్రసాద్‌వైపు కొంతవరకు ఆకర్షింపబడింది. 'ప్రసాద్‌తో యేవో కబుర్లు చెప్పాలి' అని కాంచన అనుకొనేది కాని 'యెక్కువగా మాట్లాడితే చులకన కావచ్చును' అనే భయంవలన ఆమెకూడా యెక్కువగా మాట్లాడేదికాదు. అయినా ప్రతి చిన్నవిషయానికి యేదో ఒక నెపంతో కాంచన ప్రసాద్ గదిలోనికి వెడుతూ ఉండేది. 'వేచి, చూద్దాం' అనే విధానాన్ని మొత్తంమీద కాంచన ప్రసాద్‌యెడల అవలంబించింది.

'మిస్టర్ ప్రసాద్! యెక్కడినుంచో మీకు శుభలేఖ వచ్చింది' అని అంటూ కాంచన ప్రసాద్ గదిలోనికి వచ్చింది.

కాంచన యిచ్చిన శుభలేఖను తీసికొని ప్రసాద్ చదివాడు. ఆ శుభలేఖ చదువుతున్నప్పుడు అతని ముఖంలో కొంచెం ఆశ్చర్యం కనుపించింది. అతని ముఖం చూడగానే, కాంచనకు ఆ శుభలేఖ యేమిటో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది.

'మొత్తానికి వీడు 'ఓడిపోయాడు' అన్నాడు ప్రసాద్, శుభలేఖ చదవడం పూర్తి అయిన తరువాత.

'ఓడిపోవడం యేమిటి?' అని ప్రశ్నించింది కాంచన.

'ఈ శుభలేఖలో పెళ్ళికొడుకు లోకనాథం నా క్లాసుమేటు. కాలేజీలో చదివిన నాలుగు సంవత్సరాలు వీడూ నేనూ కలిసే తిరిగేవాళ్ళం. ఆ రోజుల్లో వీడు యెప్పుడూ ప్రేమనుగురించే మాట్లాడుతుండే వాడు. తాను ప్రేమించిన పిల్లనే పెండ్లి చేసుకొంటానని, తల్లితండ్రులు చెబుతున్న మేనరికం యెంతమాత్రం చేసికోనని వీడు నాదగ్గర శపథాలు చేస్తుండే వాడు. అటువంటివాడు యిప్పుడు తల్లితండ్రులు చెప్పిన పిల్లనే పెళ్ళి చేసికొంటున్నాడు. మొత్తానికి వీడు ఓడిపోయాడు.'

'తల్లితండ్రులు చెప్పిన పిల్లనే అతను యిప్పుడు వివాహం చేసికొంటున్నాడు' అని మీరు యెలాగ చెప్పగలరు?' అని తిరిగి ప్రశ్నించింది కాంచన.

'ఇదిగో! యిందులో స్పష్టంగా ఉంది' అని అంటూ ప్రసాద్ శుభలేఖ పైకి చదవడం ప్రారంభించాడు.

'ఆదివారం రాత్రి గం. 8-15 లకు నా పుత్రుడు చి. లోకనాథానికి—చింతకుర్రు గ్రామ కాపురస్థులు రాజశ్రీ పెదపాకల ఆదినారాయణ బావగారి పుత్రిక చి. సౌ. గౌరీదేవిని యిచ్చి—చింతకుర్రు గ్రామంలో వారి గృహమందు వివాహము జరుపుటకు—

ఇంతకంటే సాక్ష్యం యింకా యేం కావాలి?' అని ప్రశ్నించాడు ప్రసాద్.

'అతని తల్లితండ్రులు చెప్పిన సంబంధం యిదేనన్నమాట' అని అన్నది కాంచన ప్రశ్నార్థకంగా.

'ఆ! యిదే, ఒకసారి నేను వాడితో కలిసి సెలవులకు ఆఊరుకూడా వెళ్ళాను.'

కాంచన యేమీ మాట్లాడలేదు.

'ఆదివారం రాత్రి అంటే రేపురాత్రికే పెళ్ళి అన్నమాట. ఉదయం బస్సులో

వెడితే మధ్యాహ్నానికి చింతకుర్రు చేరుకోవచ్చును.

సాయంత్రం, రాత్రి అక్కడ ఉండి సోమవారం ఉదయం బస్సులో తిరిగి రావచ్చును. ప్రత్యేకంగా దీని నిమిత్తం ఆఫీసుకు శెలవు పెట్టవలసిన అవసరం కూడా ఉండదు'

'అవును' అన్నది కాంచన పరధ్యానంగా.

'ప్రెజెంటు చేయడానికి సాయంత్రం యేదైనా ఒక వస్తువు కొనాలి'

కాంచన తన ఆలోచనలో తాను పడిపోయింది. ప్రసాద్ చెప్పిన మాటలు సరిగ్గా ఆమెకు వినిపించలేదు. అయినా అలవాటుకొద్దీ ఆమె 'అవును అవును' అని మాత్రం అన్నది.

'ఏమిటి అలాగ ఉన్నారు ? తలనొప్పిగా ఉందా ?' అని ప్రశ్నించాడు ప్రసాద్, ఆమె వైఖరిని చూసి.

'అబ్బే, యేం లేదు' అంటూ ఆమె తన టేబులువద్దకు వెళ్ళిపోయింది.

'తన స్నేహితుడు లోకనాథం తల్లి తండ్రులు చెప్పిన పిల్లనే పెళ్ళి చేసికొంటున్నాడు' అని ప్రసాద్ అనగానే కాంచనకు నిజంగా 'షాక్' తగిలినట్లు అయింది. తరువాత ఆమెకు యెన్నో ఆలోచనలు వచ్చాయి.

ప్రసాద్ స్నేహితుడు, అతని తల్లి తండ్రులు కుదిర్చిన పిల్లను పెళ్ళి చేసికొంటున్నాడు. కాని ప్రసాద్‌కూడా అలాగే చేస్తాడా ? ఏమో, అలాగ చెయ్యడని హామీ యేమిటి ఉంది ?

ప్రసాద్ మనిషి బాగానే ఉంటాడు, బి. ఏ. వరకు చదువుకున్నాడు. మంచి ఉద్యోగంలో ఉన్నాడు. అటువంటప్పుడు అతనికి కూడా సంబంధాలు రావడానికి అభ్యంతరం యేమిటి ఉంది ? ప్రసాద్ తల్లితండ్రులు గట్టిగా పట్టుబడితే, వాళ్ళు చెప్పిన పిల్లను ప్రసాద్ మాత్రం పెళ్ళి చేసికొనడా ?

ప్రసాద్‌తో పోల్చి చూస్తే తనస్థితి యేమాత్రం ? తను మెట్రిక్యులేషను మాత్రం పాసయింది. ఒక ఆఫీసులో స్టెనో గ్రాఫరుగా పని చేస్తున్నది అది కూడా తాత్కాలికమే. తనకు ఆస్తిగాని లుకుబడి కలిగిన బంధువులుగాని యెవరూ లేరు.



ఈ పరిస్థితిలో తనకు ప్రసాద్‌కంటె ఉన్నతస్థితిలో ఉన్న భర్త లభించడం అసాధ్యం. ప్రసాద్ తనను వివాహం చేసికొంటే, అదే ఒకవిధమైన అదృష్టంగా భావించ వచ్చును. అందుచేత ప్రసాద్ విషయంలో తాను యెంతమాత్రం అశ్రద్ధ చేయకూడదు.

'చేజిక్కిన అవకాశాన్ని యెప్పుడూ వదులుకోకూడదు దీపం ఉండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి' అని వాళ్ల బాబాయి పాపయ్య యెప్పుడూ అంటుంటాడు. కాబట్టి యీ విషయంలో తాను వెంటనే తగిన ప్రయత్నం చెయ్యాలి. ఆలస్యం చెయ్యడం మంచిదికాదు' అని కాంచన తనలో తాను తీర్మానించుకొంది.

కాంచన అసలుపేరు బంగారమ్మ. బంగారమ్మ యెలిమెంటరి స్కూల్లో చదువుకున్నప్పుడు పిల్లలందరూ ఆమెను 'బంగారమ్మ' 'సింగారమ్మ' అని వేళాకోళం చేసేవారు. మేస్టరు దాన్ని చూసి ఆమె పేరు కాంచనగా మార్చివేశాడు. ఇప్పటికీ వాళ్లపిన్ని రమణమ్మ మాత్రం ఆమెను 'బంగారం' అనే పిలుస్తూ ఉంటుంది.

చింతకుర్రుకు దగ్గరలోనేఉన్న పనస పాడు కాంచన స్వగ్రామం. కాంచన తండ్రి రత్తయ్య ఒక సామాన్యమైన రైతు. కాంచనకు సుమారు నాలుగైదుసంవత్సరాల వయస్సులోనే ఆమె తల్లి చనిపోయింది. కాంచన తల్లి చెల్లెలు రమణమ్మ అప్పుడు కాంచనను పట్నం తీసికొనివచ్చింది. పట్నంలోని ఒక హాస్పిటల్లో రమణమ్మ నర్సుగా పనిచేస్తున్నది. కాంచన పినతల్లి దగ్గరనే పెరిగి పెద్దదయింది.

కాంచన తల్లి చనిపోయిన తరువాత రత్తయ్య మళ్ళీ పెళ్ళి చేసికొనలేదు. రత్తయ్య పొలంయొక్క సరిహద్దులను గురించి అతనికీ ప్రభుత్వానికి చాలాకాలం పాటు దావా జరిగింది. చివరకు రత్తయ్య ఆ దావాలో నెగ్గాడు కాని దావా ఖర్చుల నిమిత్తం అతను చాలా అప్పులు చేయవలసి వచ్చింది. అంతేకాకుండా రత్తయ్య వెనుకా ముందూ చూడకుండా ఖర్చుచేసేవాడు. అందుచేత అతను తన స్వంత ఖర్చుల నిమిత్తంకూడా అప్పులుచేయవలసి వచ్చింది.

కాంచనకు పన్నెండేళ్ళ వయస్సులో రత్తయ్య చనిపోయాడు. అప్పటికి అతని పొలం విలువకు సరిపోయే అప్పులు ఉన్నాయి. తరువాత రత్తయ్యకు అప్పులు యిచ్చిన వాళ్ళందరూ దావాలువేసి అతని భూమిని స్వాధీనం చేసికొన్నారు.

రత్తయ్య చనిపోయిన తరువాత జరిగిన దావాల సందర్భంలో, రత్తయ్య తమ్ముడు పాపయ్య చాలాసార్లు కోర్టుకు వెళ్ళవలసి వచ్చింది. 'వ్యవసాయం చెయ్యడంకంటె కోర్టుల్లో వ్యవహారాలు నడిపించడమే యెక్కువ లాభదాయకం' అనే విషయాన్ని అతను అప్పుడు గ్రహించాడు. అప్పటి నుంచీ ఊళ్ళో యే తగాయిదా వచ్చినా, అందులో డబ్బున్న వాళ్ళ తరఫున పాపయ్య జోక్యంచేసికొని వాళ్ళను కోర్టులకు తీసికొని వెళ్ళేవాడు. అందుచేత అతనికి 'దావాల పాపయ్య' అనే పేరు వచ్చింది.

కాంచన మెట్రిక్యులేషను పరీక్షకు చదువుతున్నప్పుడు, రమణమ్మ కాంచన వివాహాన్నిగురించి పాపయ్యతో ప్రస్తావించింది.

'దగ్గర సంబంధం యేదీ లేదు. పై సంబంధమే యేదైనా చూడాలి. ఈ లోపున కాంచన యేదో ఒక ఉద్యోగం

## నీ వెవరివో

చీకటి నెలకొన్న హృదిని
మమత జ్యోతి వెలిగించి
కాంతినింపి తరలిపోదు
వెవ్వరివో చెప్పు సఖీ?

పాడు పడిన ఈ గుడిలో
దివ్యాకృతి నెలకొల్పి
దినదినము అర్చనమిడి
తరలిపోదు వెవరివో?

మూగపోయి నిదురించే
మానస వీణియ మీటి
అనురాగము పలికించే
రాగిణి నీ వెవరివో?

కారుమబ్బుదరి మెరిసే
సౌదామిని కాంతివో!
నిశి సుందరి ముసుగులో
మెరియు శుక్ర తారవో?

—కృష్ణప్రియ

చేస్తుంటే బాగా ఉంటుంది' అన్నాడు పాపయ్య.

ఆమాటమీదనే, కాంచన టైపు, షార్టు హేండ్ నేర్చుకొని ఆఫీసులో టెంపరరీ స్టెనోగ్రాఫరుగా చేరింది.

మర్నాడు ప్రొద్దున్న ప్రసాద్ బాగా ముస్తాబు అయి, బస్సుస్టాండుకు వెళ్లాడు. చింతకుర్రు వెళ్లే బస్సులో అతను ప్రవేశించేసరికి, అందులో యెదురుగా కాంచన కనుపించింది. కాంచనను చూడగానే అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది.

'ఎంతవరకు ప్రయాణం ?' అని ప్రశ్నించాడు ప్రసాద్.

'పనసపాడు'

'మీరుకూడా యీ బస్సులో వస్తున్నట్లు నిన్న నాతో అనలేదే ?'

'వద్దామని నేనుకూడా అనుకోలేదు కాని వెంటనే రమ్మనమని నిన్న రాత్రి మా బాబాయి కబురు పంపించాడు. అందుచేత ముందుగా అనుకోకుండానే బయల్దేర వలసి వచ్చింది.'

'అలాగా ! పోనీలెండి. మంచితోడు ఉంటుంది' అని అంటూ ప్రసాద్, కాంచన కూర్చున్న వరుసకు ముందువరుసలో కూర్చున్నాడు.

బస్సు బయల్దేరింది. సుమారు పది పన్నెండుమైళ్లదూరం వెళ్లింది. ఆకస్మికంగా డ్రైవరు యెందుకో రోడ్డుమధ్యనే బస్సు ఆపాడు. తరువాత అతను 'బోనెట్' యెత్తి చూసి, కండక్టరుతో యేదో చెప్పాడు.

'ఆకస్మికంగా బస్సు ఆపడానికి కారణం యేమిటో' తెల్సుకొందామని ప్రయాణీకులు కండక్టరు చుట్టూ చేరారు.

'యింజను ఫాలూకు బెల్టు తెగిపోయింది. అంతకంటే మరేమిలేదు. కొత్త బెల్టు తేవడానికి క్లీనరు యిప్పుడే సైకిలు మీద పట్నం వెడుతున్నాడు. అతను తిరిగి రాగానే బస్సు బయల్దేరుతుంది. మొత్తం అంతా రెండు గంటలకంటె యెక్కువ సేపు పట్టదు. అంతవరకు మీరు ఆ చెట్లనీడను విశ్రాంతి తీసుకోండి' అన్నాడు కండక్టరు తాపీగా.

'ఈ చుట్టుపక్కల యెక్కడైనా కాఫీ హోటలు ఉందా ?' అని ప్రయాణీకుల్లో ఒకరు ప్రశ్నించారు.

# అనగనగా...

'ఆ రోడ్డు మలుపుకు అవతల రెండు ఫర్లాంగుల్లో చిన్న పల్లెటూరు ఉంది. అక్కడ 'టీ కొట్టు' ఉంది మీరు అక్కడకు వెళ్ళవచ్చును' అని సమాధానం యిచ్చాడు కండక్టరు.

చింతకుర్రు మారుమూలన ఉన్న పల్లెటూరు. ఆ దారిలో పెద్ద ఊళ్ళు యేమీ లేవు. అందుచేత అటువైపు లారీలుగాని, కార్లుగాని తరుచుగా రావు. ఒక బస్సే చింతకుర్రుకు పట్నానికి మధ్య రోజుకు రెండుసార్లు తిరుగుతుంది. కాబట్టి మరొక బస్సులో చింతకుర్రు వెళ్ళే అవకాశం లేదు.

ప్రయాణీకులు జట్లుజట్లుగా టీకొట్లు వైపు బయల్దేరారు.

'మనంకూడా అక్కడకువెళ్ళి టీ తాగుదామా?' అని కాంచనను ప్రశ్నించాడు ప్రసాద్.

'సరే' అన్నట్లుగా తల ఊపింది కాంచన.

ఇద్దరూ టీకొట్టువద్దకు వెళ్ళి టీ తాగారు. డబ్బులు ప్రసాద్ యిచ్చివేశాడు.

'ఈ ప్రయాణంలో మీరు లేకపోయినట్లయితే నాకు చాలా విసుగ్గా ఉండేది. మీరు ఉండడంవలన బస్సు ఆగిపోయినా, యేదో కాలక్షేపం అవుతుంది' అన్నాడు ప్రసాద్.

'మీరు లేకపోయినట్లయితే నాకూ చాలా విసుగ్గా ఉండేది.'

'ఇక్కడ యెంతసేపు కూర్చుంటాం? అలాగ వెళ్ళి, యే చెట్టునీడను అయినా కూర్చుందాం.'

'అలాగే' అన్నది కాంచన,

మధ్య దారిలో బస్సు యిలాగ ఆగిపోవడం కాంచనకు చాలా సంతోషాన్ని కలిగించింది. 'తన సామర్థ్యంవల్లనే బస్సు ఆగిపోయింది' అన్నంత నమ్మకం ఆమెకు కలిగింది. 'ఈ అవకాశాన్ని జారవిడుచుకోకూడదు' అని అనుకొన్నది కాంచన.

బస్సుకు కొంతదూరంలో ఒక తోటతోపు ఉన్నది. ప్రసాద్, కాంచన యిద్దరూ ఆ తోటతోపులోనికి వెళ్ళి అక్కడ నీడలో కూర్చున్నారు. అక్కడ వారిద్దరూ తప్ప యింకెవరూ రాలేదు,

అప్పటికి సుమారు తొమ్మిదిన్నర అవుతుంది కాని మబ్బులుపట్టడంవలన యెండ తీవ్రత యేమీ లేదు. అక్కడ చెట్లమీద ఉన్న పక్షుల కిలకిలలు తప్ప యింకే ధ్వని లేదు. చాలా ప్రశాంతంగా ఉంది. చెట్లమీదనుంచి చల్లనిగాలి వీస్తూ ఉన్నది.

ఇటువంటి మనోహరమైన వాతావరణంలో తన ప్రేమనుగురించి చెబుదామనుకొన్నాడు ప్రసాద్ కాని ఆ ప్రస్తావన యెలాగ తీసికొనిరావాలో అతనికి తోచడం లేదు.

వారి యిద్దరి మనస్సులల్లోను ఒకే రకమైన ఆలోచనలు ఉన్నాయి. కాని వాటిని ముందుగా వెలిబుచ్చడానికి యిద్దరూ జంకుతున్నారు. వారు అక్కడ కూర్చుని ఉండగా సుమారు పదిహేను నిమిషాలు గడిచిపోయాయి. ఆ పదిహేను నిమిషాలూ వారికి పదిహేను సంవత్సరాల్లాగా కన్పించాయి.

'తాటిముంజలు కావాలా?' అంటూ ఒక

## సౌందర్యపోషణకై కొన్ని సలహాలు

* వేసవిలో చాలా మందికి ముఖానికి పోత పోసి 'మంట'గా ఉంటుంది. ముంజల్లో ఉండే నీటిని ముఖానికి రాసి ఓ ఐదు నిముషాల తర్వాత కడిగితే త్వరగా 'మంట' 'పోత' తగ్గుతాయి

* ప్రతిరోజూ రెండుసార్లు మంచి గంధాన్ని రగదీసి ముఖానికి రాసుకుంటూ ఉంటే మొటిమలూ, మచ్చలూ తగ్గుతాయి.

* నిద్ర పోవడానికి ముందు కంట్లోనూ, కంటి రెప్పల మీదానూ ఆముదం వేసుకుని పడుకుంటే కంటి రెప్పలు అందంగా నల్లగా పొడుగ్గా పెరుగుతాయి.

* ఆముదంలో పసుపు కలిపి కాళ్ళు పగిలిన చోట రాసుకుని స్నానంచేస్తూంటే కాళ్ళ పగుళ్ళు తగ్గుతాయి.

* నిమ్మరసం ముఖానికి, మెడకూ, చేతులకూ, ప్రతిరోజూ రాసుకుని, ఓ ఐదు నిముషాల తర్వాత సున్నిపిండిలో కొన్ని పాలు, నిమ్మరసం కలిపి నలుగు పెట్టుకుని స్నానం చేస్తే శరీరాన్కి మంచి సౌందర్యం వస్తుంది,

* అతి మధురాన్ని దంచి పొడిచేసి, ఆత్రైడపట్టి గేదెపాలతో నూరి తలకు రాసుకుని స్నానం చేస్తూంటే చుండ్రు తగ్గుతుంది.

* తలకు ఎక్కువగా ఆముదాన్ని వాడుతూ ఉంటే చాలా మంచిది. కనీసం వారానికి రెండు సార్లయినా రాత్రి ఆముదం తలకు మర్దించి ఉదయాన్నే తలంటు పోసుకుంటూఉంటే జుట్టు నల్లగా, పొడుగ్గా పెరుగుతుంది.

* తులసీ ఆకుల్ని పిండి రసంతీసికొన్ని ఉప్పుకలిపి మొటిమం పైన రాసి అయిదారు నిముషాల తర్వాత సున్నిపిండితో ముఖం కడిగేసుకుంటే మొటిమలు త్వరగా తగ్గిపోతాయి.




* ఉప్పు, నిమ్మరసంతో పళ్ళుతోముతూ ఉంటే పళ్ళు తెల్లగా మెరిసేట్టు తయారవుతాయి.

—శ్రీరామలక్ష్మీనారాయణమూర్తి.

కుర్రవాడు వాళ్ళదగ్గరకువచ్చాడు. ఆకుర్రవానికి రమారమి పన్నెండు సంవత్సరాల వయస్సు ఉంటుంది. ఒక చిన్న లాగు కట్టుకొని, దానిమీద ఒక గుడ్డ చుట్టుకొన్నాడు ఆ కుర్రవాడు. అతని చేతిలో ఒక చిన్న కర్ర ఉంది. కుర్రవాడు చాలా చలాకీగా ఉన్నాడు.

'అక్కరలేదు' అన్నాడు ప్రసాద్.

'ఇక్కడ ముంజలు చాలా బాగుంటాయి. నాకు ఒక పావలా, యిస్తే చాలు. మీరు తిన్నన్ని ముంజలు కొట్టి పెడతాను' అన్నాడు ఆకుర్రవాడు నిరుత్సాహపడకుండా.

ఆ కుర్రవాని వైఖరిచూస్తే వాళ్ళను సులువుగా వదిలేలాగ కన్పించలేదు. అందుచేత వాడిదగ్గర తాటిముంజలు తీసికొని, మంచి చేసుకోవడమే, వాడిని తొందరగా వదిలించుకోవడానికి మార్గం' అనుకొన్నాడు ప్రసాద్.

'సరే, తాటిముంజలు తీసి పెట్టు. తొందరగా తియ్' అన్నాడు ప్రసాద్ ఓడిపోయినట్లుగా ముఖంపెట్టి.

'ఓకే' అంటూ ఆ కుర్రవాడు అక్కడనుంచి యెక్కడకో పరుగెత్తాడు.

ఆ కుర్రవాడు 'సరే' అని అనడానికి బదులుగా 'ఓకే' అనడంతో కాంచన, ప్రసాద్ యిద్దరూ కూడా నిర్ఘాంతపోయారు.

రెండునిమిషాల్లో ఆకుర్రవాడు బందం, కత్తి తీసికొనివచ్చాడు. ఉడతలాగ చకచకా ఆ కుర్రవాడు తాటిచెట్టు యెక్కి కాయలుకొట్టాడు. తరువాత అతడు చెట్టు దిగివచ్చి యీలవేస్తూ ప్రసాద్‌కు కాంచనకు తాటికాయలు కొట్టియివ్వడం ప్రారంభించాడు.

'వెంటనే డబ్బు యిచ్చివేస్తే, వాడు వెళ్ళిపోతాడుగదా!' అనుకొని ప్రసాద్ పర్సు తీశాడు. పర్సులో చిల్లరలేదు. రూపాయి నోటు తీసి. ప్రసాద్ ఆ కుర్రవానికి యిచ్చాడు.

'చిల్లరలేదా సార్?' అని ప్రశ్నించాడు కుర్రవాడు.

'లేదు' అన్నాడు ప్రసాద్ విసుగ్గా.

'ఓకే, నేనే మార్చి తెస్తాను లెండి' అంటూ ఆ కుర్రవాడు మళ్ళీ తాటికాయలు కొయ్యడం ప్రారంభించాడు.

వాడి చలాకీతనం, యింగ్లీషు పదాలు వాడడం చూసిన తరువాత కాంచనకు ఆ

కుర్రవాని పేరు యేమిటో తెల్సుకోవాలనే కుతూహలం కలిగింది.

'నీపేరు యేమిటి ?' అని ప్రశ్నించింది కాంచన.

'నాపేరు సింహాచలం. అందరూ నన్ను 'డైరెక్టరు సింహాచలం' అని అంటారు లెండి' అని సగర్వంగా సమాధానం యిచ్చాడు డైరెక్టరు సింహాచలం.

'వీడు అనవసరంగా సంభాషణ పెంచుతున్నాడు' అని కోపం, డైరెక్టరు అంటున్నాడు అది యేమిటో తెల్సుకోవాలనే కోరికా రెండూకూడా కలిగాయి ప్రసాద్‌కు

## అనగనగా...

'డైరెక్టరు మీ యింటిపేరా?' అని ప్రశ్నించాడు ప్రసాద్.

'కాదు, డైరెక్టరు నా పేరే. మేం యిక్కడ 'అవుట్‌డోర్ ఆట' ఆడుతుంటాం అందులో నేను డైరెక్టర్ని. అందుచేత నన్ను అందరూ 'డైరెక్టరు సింహాచలం' అని అంటారు.'

'అవుట్‌డోర్ ఆట అంటున్నావు. అది యేమిటి?' అని ప్రశ్నించింది కాంచన మరింత కుతూహలంతో.

'మూడునెలల క్రిందట యిక్కడకు ఒక సినిమా కంపెనీవాళ్ళు వచ్చారు. వాళ్ళు సరిగ్గా యీ స్థలంలోనే 'ద్రోహం' అనే సినిమా అవుట్‌డోర్ షూటింగ్ చేశారు. అందులో యిక్కడే 'గోపి,' 'శీల' అని హీరో, హీరోయిన్లు ప్రేమించుకుంటారు' మేం అందరం ఆ 'అవుట్‌డోర్ షూటింగ్' చూశాం. అప్పటినుంచీ కుర్రవాళ్ళం అందరం యిక్కడ 'అవుట్‌డోర్ షూటింగ్ ఆట' ఆడుకొంటున్నాం. అందులో నేను డైరెక్టర్ని' అన్నాడు సింహా

(38వ పేజీ చూడండి)

# సినిమా

## సెహభాష్ శారదా!

అని మీరంటారు. ఎప్పుడు? మమత ప్రొడక్షన్స్ వారి 'కాలంమారింది' చిత్రం చూసినప్పుడు. అంటరాని పిల్లగా ఊర్వశి నటన అసాధారణంగా వుంది. తన్ను పెంచిన తల్లి, తండ్రికి దూరమయ్యే దృశ్యంలో శారద నటన రాతి గుండెని కూడా కరగించి, కన్నీరు కారిపిస్తుంది. ఈ చిత్రానికి దర్శకుడు కాశీనాధుని విశ్వనాథ్‌ను మొదటి హీరోగా పేర్కొనాలి. ప్రతి సన్నివేశం పండించారు. కథానాయకుడి వేషాన్ని శోభన్ ధరించారు కామెడీ పోషణలో కూడా అందె వేసినచేయి అని శోభన్ ప్రూవ్ చేశాడు.

పై చిత్రానికి బొల్లిముంత మాటలను, రాజేశ్వర్రావు సంగీతాన్ని, అశోక్‌కుమార్ ఛాయను, పత్యం కూర్పును, కళాధర్ కళను నిర్వహించారు.

పూజ్య బాపూజీకి అంకితం చెయ్యబడే 'కాలం మారింది' పత్రికా రచయిత వాశిరాజు ప్రకాశం జాతకాన్ని మారుస్తుంది. ఈ చిత్రంలో గుమ్మడి, అంజలీదేవి, సూర్యకాంతం, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, గీతాంజలి, పుష్పకుమారి, పొట్టి ప్రసాద్ ప్రధాన పాత్రధారులు.

## స్త్రీ వేషంలో చంద్రమోహన్!

ఇప్పుడిప్పుడే పైల్‌లోకి వస్తున్న చంద్రమోహన్ 'కాలంమారింది'లో ఆడవేషాన్ని ధరించాడు. అసలుసిసలైన స్త్రీ మూర్తిగా కనిపిస్తాడు. ఈ చిత్రానికి లక్ష్మి పంపిణీదారులు.

## రెండవ కథ రెడీ!

'కాలం మారింది' షూటింగు పూర్తయింది. అక్టోబర్‌లో విడుదల చెయ్యాలని నిర్మాత సంకల్పం. రెండవ చిత్రానికి కూడా కథ సిద్ధంగా వుందట. శోభన్ ఇచ్చే తేదీల ననుసరించి, షూటింగు ప్రారంభిస్తారట.

## కృష్ణ తండ్రిగా కాంతారావు!

అమృతాఫిలింస్ వారి 'నేరము—శిక్ష' కథను నటుడు బాలయ్య వ్రాశారు. మాటలను మోదుకూరి జాన్సన్ రచించారు. దర్శకత్వాన్ని కె. విశ్వనాథ్ సంగీతసారధ్యాన్ని రాజేశ్వర్రావు నిర్వహిస్తున్నారు. ఈ చిత్రానికి యోగానంద్, రామచంద్రయ్యలు ఛాయాగ్రహణాన్ని చేపట్టారు.

హీరోగా కృష్ణ, అతగాడి తండ్రిగా టి.ఎల్. కాంతారావు, తల్లిగా పండరీబాయి నటిస్తారు. గుడ్డివాని పాత్రలో బాలయ్య, నక్కవినయం గల వ్యక్తిగా సత్యనారాయణ కనిపిస్తారు.

'నేరము—శిక్ష' మొదటి పాటను కొసరాజు వ్రాయ, సెప్టెంబర్ 21 న గార్డెన్‌లో రికార్డింగు జరిపారు. షూటింగు అక్టోబరులో ప్రారంభమవుతుంది. శ్రీ ఫిలింస్ విడుదల.

## విచిత్ర బంధంలో భాగ్యనగరం

అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మించిన 'విచిత్రబంధం'లో భాగ్యనగరం అంతర్నాటకం (పద్యరూపం) ఒకటుంది. చిత్రంలో యిదొక హైలైటు. ఈ గేయరచన్ను ఆచార్యఆత్రేయ వ్రాశారు.

'భళి భళి వినరా ఆంధ్రకుమారా భాగ్యనగరగాధా మూసీనదిపై వెలసినట్టి మన రాజధాని గాధా' అంటూ ఘంటసాల, సుశీల కంఠాలు మారుమ్రోగ స్టేజిపై నాగేశ్వర్రావు, వాణిశ్రీ అభినయించారు.

## ముస్లిం యువరాజు పాత్రలో అక్కినేని

గోలుకొండ నేలిన మల్కిభరాం కుమారుడు, అందాల యువరాజు కులీకుతుబ్‌షా, చంచల పల్లెలో వసించిన నర్తకి భాగమతికి మనస్సునిచ్చినాడు. మల్కిభరాంగా సత్యనారాయణ, కులీకుతుబ్‌షాగా నాగేశ్వర్రావు, భాగమతిగా వాణిశ్రీ నటించారు. ఈ చిత్రానికి ఆదుర్తి సుబ్బారావు దర్శకుడు. ప్రముఖ నిర్మాత దుక్కిపాటిగారి చిత్రాల్లో కాస్ట్యూమ్స్ గెటప్ యిందులో తప్ప, మరెందులోనూ లేదు.

ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి 'విజేత' యొక్క తెరరూపమే 'విచిత్ర బంధం'. చేసిన మార్పు,చేర్పులు సహజంగా, నవ్యంగా వుండి ప్రేక్షకులు యిష్టపడేవిగా అమరడం ఒక విశేషం. హిట్ అయ్యే మంచి చిత్రం యిది.

## హిందీ మాష్టరుగా అక్కినేని!

పద్మశ్రీ పిక్చర్స్ ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మిస్తున్న చిత్రానికి సరయిన పేరు యింకా దొరకలేదు. 'ప్రేమకోసం' టైటిలు తేలికగా వుందట. అందుచేత మరొక మంచిపేరు కోసం వెతుకుతున్నట్టు నిర్మాత వెంకటేశ్వర్లు చెప్పారు. ఈ చిత్రానికి పి. పుల్లయ్య దర్శకుడు.

పై చిత్రంలో అక్కినేని హిందీమాష్టరుగా కనిపిస్తారు. వాణిశ్రీ అనురాగాన్ని సంపాదించడాని కోసం, అక్కినేని హిందీ మాష్టరు రూపంలో ఆమె యింట్లో ప్రవేశించి, ఆమెతో చనువుగా వుండి, ఆమె యెదలో చోటు నేర్పరచుకుంటారు. ఈ చిత్రానికి ఆచార్యఆత్రేయ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, ఎస్. కృష్ణారావు కళను నిర్వహిస్తున్నారు.

## ఎస్వీఆర్ కుమారుడుగా ఏ.ఎన్.ఆర్

పై చిత్రంలో ఎస్వీరంగారావు కుమారుడిగా నాగేశ్వర్రావు, గుమ్మడి కుమార్తెగా వాణిశ్రీ నటిస్తున్నారు. ఎస్వీఆర్ ఫ్యామిలీ డాక్టరుగా జగ్గయ్య కనిపిస్తారు. నర్సు వేషం లక్ష్మి ధరిస్తుంది. అక్కినేనిని కన్నతల్లిగా శాంతకుమారి సాక్షాత్కరిస్తుంది. హాస్య జంటగా రాజబాబు, రమాప్రభ దర్శనమిస్తారు. ఈ చిత్రానికి కె.ఎస్. ప్రసాద్



'కాలం మారింది'లో శారద, శోభన్‌బాబు.

ఛాయాగ్రహణం పెద్ద యస్సెట్ అని చూసినవాళ్ళు చెపుతున్నారు. శ్రీ ఫిలింస్ విడుదల.

## బంగారుబాబులో రాజేష్, శివాజీ

జగపతి ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌తో నిర్మిస్తున్న 'బంగారుబాబు' చిత్రంలో రాజేష్‌ఖన్నా, శివాజీగణేశన్ గెస్టు పాత్రలను పోషించారు. తెలుగు చిత్రంలో రాజేష్‌ఖన్నా నటించిన మొదటి చిత్రం యిది. జగపతి అధినేత రాజేంద్రప్రసాద్ తీసే ప్రతి చిత్రంలో ఏదేని ప్రత్యేకత కనిపిస్తుంది. బాక్సాఫీసు ఫార్ములాను బాగా జీర్ణించుకున్న వ్యక్తిగా రాజేంద్రప్రసాద్‌గారిని పేర్కొనవచ్చు.

హెలికాప్టర్ ఫైటింగు, రాజేష్‌ఖన్నా యాక్టింగు 'బంగారుబాబు'లోని ప్రత్యేకత. ఈ చిత్రానికి ఆచార్యఆత్రేయ మాట, పాటలను వ్రాశారు. ఇక

# సినిమా

ఛాయాగ్రహణం అంటారా— ది ఏస్ కెమెరా విజర్డ్ ఎస్. వెంకటరత్నం గూర్చి వేరే చెప్పాలా! అలాగే కె.వి.మహదేవన్ కూడా అన్నిపాటలు హిట్‌అయ్యేట్లు జగపతికి ట్యూన్ చేస్తారు. కళను ఎస్. కృష్ణారావు, కూర్పును సంజీవి నిర్వహిస్తున్నారు. కథ, సినిమా అనుకరణ, దర్శకత్వంను వి. బి. రాజేంద్రప్రసాద్ చేపట్టారు.

బంగారుబాబుగా నాగేశ్వరరావు, నాయికగా వాణిశ్రీ, విలన్‌గా నాగభూషణం, హాస్యపాత్రధారులుగా రాజబాబు, రమాప్రభ, కనిపిస్తారు. గెస్టు పాత్రలను ఎస్వీరంగారావు, జగ్గయ్య, గుమ్మడి, పద్మనాభం పోషించారు. వీళ్లతోబాటు శోభన్, కృష్ణలు కూడా యీ చిత్రంలో నటించారు. సంక్రాతికి అన్నపూర్ణా విడుదల చేస్తారు.



'కులగౌరవం'లో ఆరతి.

## ఒకే చిత్రంలో యిద్దరు దేవీలు

విశ్వజ్యోతి పిక్చర్స్ నిర్మిస్తున్న 'మాతృమూర్తి' చిత్రం షూటింగు పూర్తయింది. కె. సత్యనారాయణ, రాజేంద్రకుమార్ నిర్మించిన యీ చిత్రానికి మానాపురం అప్పారావు దర్శకుడు. ఆయనకు సుస్తీ చేసినప్పుడు, దాసరి నారాయణరావు దర్శకత్వాన్ని చూసేరు. అంటే కో—డైరెక్టరు అన్నమాట.

'మాతృమూర్తి'లో యిద్దరు దేవీలు వున్నారు. టైటిల్ పాత్రను అంజలీదేవి, నాయికవేషాన్ని సరోజాదేవి పోషించారు.

## హరనాధ్—చంద్రమోహన్!

పై చిత్రంలో హరనాధ్, చంద్రమోహన్ అన్న, దమ్ములుగా నటించారు. హరనాధ్ భార్యగా సరోజాదేవి, చంద్రమోహన్ ప్రేయసిగా అనిత కనిపిస్తారు. హీరోయిన్ తండ్రి పాత్రను గుమ్మడి ధరించారు. నవ్వును పుట్టించే భూమికల్ని అల్లు రామలింగయ్య, రాజబాబు, రమాప్రభ నిర్వహించారు. కృష్ణంరాజుకు విలన్‌వేషం యిచ్చారు. ఈ చిత్రానికి సముద్రాల—రాజశ్రీ రచన్ను, పెండ్యాల సంగీతాన్ని, స్వామి ఛాయను నిర్వహించారు. శ్రీ ఫిలింస్ విడుదల.

## అభిమానించే అయిదుగురు

ఉషశ్రీ అధినేత చిన్నపరెడ్డికి పరిశ్రమలో అయిదుగురంటే చాలా యిష్టం. వాళ్ల అడుగు జాడల్లో తన జీవితాన్ని సాగించాలన్న తలంపు ఆయనకుంది. ఆయన గౌరవించే ఆ అయిదుగుర్ని మీకూ చెపుతాను. వి.బి.రాజేంద్రప్రసాద్, డి.రామానాయుడు, దుక్కిపాటిమధుసూదనరావు, డి.వి.ఎస్. రాజు, విశ్వేశ్వరరావు.

పై అయిదుగురిలో మీకు వచ్చిన అంశు ఏమిటి? అని చిన్నపరెడ్డిని ప్రశ్నించాను. 'మంచితనం, వృత్తిలో విశ్వాసం, నిర్మాణసామర్థ్యం, మంచి టేస్టు వున్న అయిదుగురిని అభిమానించడం తప్పా?' అని ఎదురు ప్రశ్న వేశారు దర్శకుడు చిన్నపరెడ్డి.

మీకు దర్శకత్వం చేపట్టాలన్న తలంపు ఎప్పుడు ఏర్పడింది? అన్నాను. 'నా జీవిత నౌకను నడిపించే మా అన్నయ్య మారిరెడ్డి ఆజ్ఞ యిది. అందుకే శిరసావహించాను' అన్నారు.

## సినిమా మాసపత్రిక

'ఉషశ్రీ' పేరుతో ఒక సినిమా మాసపత్రికను ప్రారంభించే వుద్దేశం వుంది. ఆఫ్‌సెట్‌లో ప్రింట్ చెయ్యాలన్న ఆశవుంది. అతి త్వరలో విజయవాడలో మ్యాగజైన్ ప్రారంభం అవుతుంది' అన్నారు చిన్నపరెడ్డి.

# శ్రీమతి మతి






ఊఁ ఊఁ ఫస్టు క్లాసు టికెట్లే కొంటూంటే! సరిగ్గా ఇదే సినిమాకి ఆ పక్కింటి సుశీలా వాళ్లూ రావాలి - ఖర్మ!!
I
II
III
నేడే చూ


ఇంకా చీర సెలక్షను కాలేదా?
అహా! ఏం లేదూ!! దానికి మాచ్ అయ్యేలా నేనూ డ్రెస్ చేస్కోవాలిగా!!!
.....మతి.... !!




చచ్చాం! ఏవిటికి ఒహాటే నవ్వుతోంది? ఈ రాత్రికే ఆఫీసులో పడుకోడమే మంచిది!!


నీయిష్ట మొచ్చి నప్పుడే ఆ కళ్లు విప్పు!! అందాక నే ఆఫీసుకు శలవు పెడతా నన్నానుగా!!

# సి ని మా

## రామరాజ్యం

## న్యాయం, ధర్మం, సత్యం

ఫ్యామిలీ సెంటిమెంటు వున్న కథలను ప్రజాను రంజకంగా చిత్రించే మేధస్సు రామవిజేత బాబురావుకు వుంది. కాబట్టే, ఆయన దర్శకత్వంలో వెలువడిన చిత్రాలన్నీ విజయలక్ష్మిని చేపట్టాయి.

స్వర్గీయ కె.వి.రెడ్డి శిష్యరికం వృథా పోతుందా? 'గురువును మించిన శిష్యుడవు గావాలి' అన్న కె.వి. గారి దీవెన దారితప్పుతుందా?

ఇంతవరకు నిర్మించిన మూడుచిత్రాలన్నీ ఒక ఎత్తు, యిప్పుడు నిర్మితమయ్యే 'రామరాజ్యం' ఒక ఎత్తు. మనిషి మనుగడకు ప్రధానమైన న్యాయం, ధర్మం, సత్యం 'రామరాజ్యం' ప్రధాన తారాగణం.

న్యాయంకోసం అనుక్షణం వాదించే వ్యక్తిగా ఎస్వీరంగారావు, ధర్మంకోసం ప్రాకులాడే వ్యక్తిగా గుమ్మడి, సత్యం జయిస్తుంది అన్న ధ్యేయం గొన్న వ్యక్తిగా జగ్గయ్య ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు.

## సావిత్రి—చంద్రకళ

గ్రామ వైద్యుడిగా జగ్గయ్య, ఆయన సహధర్మచారిణిగా సావిత్రి, కుమార్తెగా రోజారమణి నటిస్తున్నారు. ఈ చిత్రంలో శరత్‌బాబు అనే నూతన నటుణ్ణి నిర్మాత కె. ఏ. ప్రభాకర్ పరిచయం చేస్తున్నారు. అతనికి జంటగా చంద్రకళ నటిస్తూంది. గ్రామ పంచాయితీ అధ్యక్షుడిగా ప్రభాకరరెడ్డి, అతగాడి నేస్తంగా అల్లురామలింగయ్య కనిపిస్తారు.

## రాజబాబు—లీలారాణి

'రామరాజ్యం' చిత్రంలో సుజాత అనే కొత్త అమ్మాయి కనిపిస్తుంది. ఆమె తల్లిగా సురభి బాలసరస్వతి నటిస్తుంది. మరొక క్లిష్టమైన భూమికను జి. వరలక్ష్మికి యివ్వాలనుకుంటున్నారు, రామలక్ష్మణులు. హాస్యజంటగా రాజబాబు, లీలారాణిని బుక్ చేశారు.

## బాబురావు శిక్షణ

దర్శకుడు బాబురావు కొత్తనటుడు శరత్‌బాబుకు యిస్తున్న శిక్షణ అతడికి చక్కటి భవిష్యత్తును యేర్పరుస్తుంది. సెట్టుకి వెళ్ళేముందు ఆఫీసులో అతడిచేత రిహార్సలు చేయించి, షూటింగు సమయాన అతడు చెప్పే డైలాగులను అతడిచేత వినిపించి, డైలాగులో మాడ్యులేషన్ ఎలా వుండాలి అన్న విషయాన్ని అతడికి నేర్పి, సీనులో తనకు కావలసిన ఎఫెక్టును రాబట్టుకుంటున్నారు. బాబురావు తీసుకుంటున్న శ్రమ, శరత్‌బాబుకు మంచిరోజులను, తర్ఫీదు నిచ్చిన దర్శకునికి మంచి పేరును తెచ్చిపెట్టటం తథ్యం.

## త్వరలో లైలా—మజ్ను

రామవిజేతా నిర్మించే తర్వాతి చిత్రం 'లైలా—మజ్ను' అని యిదివరకే తెలిపాను. దీన్ని ఒక కళాఖండంగా నిర్మించడానికి నిశ్చయించినట్టు, కలర్‌లో నిర్మాణం చెయ్యదలచినట్టు రామవిజేత సోదరులు చెప్పారు.

## రాజబాబు విజ్ఞాపన

ప్రముఖ హాస్యనటుడు రాజబాబు ఒక మంచి కార్యాన్ని తలపెట్టారు. కాళహస్తి గుడి సహాయార్థం కొంత ధనాన్ని సేకరింప దలిచాడు. తనకు రోజుకు వంద వుత్తరాలు వస్తున్నాయట. అందరూ తన ఫోటోలను కావాలని వ్రాస్తున్నారట. వాళ్ళందరికీ రాజబాబు ఒక విజ్ఞాపన చేస్తున్నారు.

'తన ఫోటోను కోరే అభిమానులు, కాళహస్తి గుడికి మూడు రూపాయలు పంపి, ఆ మనియార్డరు రసీదును తనకు పంపితే, వెంటనే తను సంతకం చేసిన నిశ్చల ఛాయాచిత్రాన్ని పోస్టు చేస్తారట.'

## సారథిలో చంద్రమోహన్!

సారధి అండ్ టి.పి.ఆర్. కంబైన్స్ నిర్మిస్తున్న చిత్రంలో చంద్రమోహన్ ఒక ముఖ్యపాత్రను పోషిస్తున్నాడు. లోగడ శరత్‌బాబు అనుకున్నారు. చంద్రమోహన్ సరసన లీలారాణి నటిస్తూంది. ప్రముఖ దర్శకుడు తాతినేని ప్రకాశరావు నిర్దేశకత్వంలో తయారయ్యే యీ చిత్రంలో శోభన్, వాణిశ్రీ, ఎస్వీరంగారావు, గుమ్మడి, రాజబాబు, అల్లురామలింగయ్య ముఖ్యపాత్రధారులు. ఇప్పటికి రెండు సెట్ల పని జరిగింది.

## దున్నే వానిదే భూమి

నవ సమాజ నిర్మాణానికి, ప్రజాస్వామ్య సుస్థిరతకు, దేశసౌభాగ్యానికి, మానవాళి మనుగడకు భూమిదున్నేవానిదే కావాలి. ఈ సత్యాన్ని చాటేదే అమ్మా పిక్చర్సువారి 'దున్నేవానిదే భూమి'.

పేదరైతుగ పద్మశ్రీ శివాజీగణేశన్ అపురూప నటన, తెరవెనుక 'కళావాచస్పతి' శ్రీ జగ్గయ్య అపూర్వకంఠస్వరం, యీ సంచలన దృశ్య కావ్యానికి ప్రత్యేక ఆభరణాలు.

పల్లెపడుచులుగ పద్మశ్రీ బి.సరోజాదేవి, విజయనిర్మల, బస్తీ పిల్లగ గీతాంజలి, ఇంకా నాగేష్, పండరీబాయి మొదలయినవారు నటించారు.

రచన ఆరుద్ర, సంగీతం యమ్. ఎస్. విశ్వనాథం, కె. రాజేష్ నిర్వహణ పంచాక్షరి, దర్శకత్వం ఏ. సి. త్రిలోక్‌చందర్.

నిర్మాత కుర్రా అమ్మేశ్వరరావు.

## పసివాని పగ

యంగ్‌టర్క్ ప్రొడక్షన్సు పేరిట కె.ఎం. నాయుడు, చిట్టిబాబు నిర్మిస్తున్న 'కౌబాయ్' చిత్రానికి 'పసివానిపగ' అనే పేరును స్థిరపరిచారు. మాష్టర్ ప్రభాకర్ టైటిల్‌రోల్ నిర్వహిస్తున్నాడు. టైటిల్ సూచించిన పాఠకుల పేర్లలో నలుగురిని లాటరీ పద్ధతిని ఎన్నుకుని, బహుమతిని పంపించింది. పైగా వారిపేర్లు టైటిల్‌కార్డుపై చిత్రంతో నమోదు చేస్తుంది. మిగిలిన వారందరికీ మాష్టర్ ప్రభాకర్ ఆటోగ్రాఫ్‌గల అభినందన లేఖలు పంపుతుంది.

ఇప్పటికి 7 రీళ్లు పూర్తయిన ఈ కొత్త తరహా చిత్రంలో మాష్టర్‌ప్రభాకర్‌తో బాటు విజయచంద్ర, విజయలలిత, జ్యోతిలక్ష్మి, విజయశ్రీ, జయకుమారి, సూర్యకాంతం, హేమలత, బేబి సుమతి, ఝాన్సీబాయి, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు,



'విచిత్ర బంధం'లో వాణిశ్రీ, నాగేశ్వరరావు.

ఆ చక్కని,
పరిశుభ్రమైన తెల్లదనానికి

# ఓ ఓ బి
# నీలి

ఓ ఓ బి నీలి నీటిలో అతి సులభంగా, పూర్తిగా కరుగుతుంది. తెల్లటి దుస్తులకి సమమైన మంచులాంటి తెల్లదనాన్నిస్తుంది. మీ చొక్కాలకు, చీరలకు, దుప్పట్లకు మరియు ఇతర బట్టలకు అధికమైన తెల్లదనాన్నివ్వడానికి ఇదే అతి పొదుపైన పద్ధతి. నీలపు మరకలుండవు. ఛసుపు రంగుగా మారదు.

ఓ ఓ బి నీలి భారతదేశంలో కెల్లా పెద్దదైన, ఆధునికమైన ఫ్యాక్టరీలో పశ్చిమ జర్మనీవారి సహకారంతో తయారుచేయబడుతున్నది.






తయారుచేయువారు:

**అల్ట్రామెరైన్ పిగ్‌మెంట్స్ లిమిటెడ్** అంబత్తూరు, మద్రాసు-53

UPL/6546

# కొత్త తార దొరికింది

నందినీ ఫిలింస్ వారి 'ఇల్లు—ఇల్లాలు' చిత్రం చూశాను. అందులో బాల వితంతువు పాత్ర ఒకటి వుంది. ఆ పాత్రను యిరవై కూడా నిండని ఒక అమ్మాయి పోషించింది. ఆమెను తెరపై యింతకు ముందెన్నడూ చూడలేదు. ఆ నటి పేరేమిటి? అని నిర్మాత సుబ్బిరెడ్డిని అడిగాను. విజయ అని చెప్పారు. ఆమెతోనే జరిపిన యింటర్వ్యూను మీకు తెలుపుతున్నాను.

ప్ర : మీ ఊరు ఏది?

వి : తెనాలి.

ప్ర : మీకు మరొక పేరు వుందట?

వి : నా అసలుపేరు విజయగిరిజ.

## విజయంకోసం ...

ప్ర : పేరు మార్పుకు కారణం?

వి : విజయాన్ని సాధించాలన్న ఆశతో గిరిజను తీసేసి, విజయ మాత్రం వుంచుకున్నాను.

ప్ర : మీకు నాటకానుభవం వుందా?

వి : నాకు, ఆరేండ్ల ప్రాయం నుంచే నాటకాలన్నా, సినిమాలన్నా చాలా యిష్టం.

## మరువలేని దినాలు

ప్ర : మీకెప్పుడయినా బహుమతులు వచ్చాయా?

వి : రెండుసార్లు వచ్చింది. 'రేపటిమనిషి' ఉత్తమనటి బహుమతిని నాగేశ్వరరావుగారి వద్ద, 'శిరోమణి' వుత్తమనటి అవార్డును భానుమతిగారి వద్ద అందుకున్నాను. నా జీవితంలో మరువలేని విషయాలు యీ రెండే.

ప్ర : డాన్సింగులో ప్రవేశం వుందా?

వి : తెనాలి చదలవాడ నారాయణరావు గారి వద్ద భరతం నేర్చాను.

ప్ర : సినిమా ఛాన్సు ఎలా దొరికింది?

వి : నందినీ అధినేత సుబ్బిరెడ్డిగారు నాకు అవకాశాన్ని యిచ్చారు.

ప్ర : బాల వితంతువుగా వేషం వెయ్యడానికి ఎలా సమ్మతించారు?

వి : ఏపాత్ర అయితేనేం. ఇచ్చిన వేషానికి న్యాయం చెయ్యడం నా ధర్మం. మంచికాలం వస్తే, మంచి, మంచి పాత్రలు రాకుండా పోతాయా? వున్నదాంతో తృప్తిపడే మనస్తత్వం నాది.

## అవసరాన్నిబట్టి డ్రస్

ప్ర : సెక్స్ దృశ్యాల్లో నటించడానికి విముఖత చూపిస్తారా?

వి : పాత్రను బట్టి, సన్నివేశ అవసరాన్ని బట్టి, డ్రస్ వేసుకోక తప్పదు. మరీ సెక్సీగా వుండే పాత్రలను అంగీకరించను.

ప్ర : భవిష్యత్తును గూర్చి కలలు గంటున్నారా?

వి : లేదు. మంచిగా వుండి, యిచ్చిన పాత్రలో నిండుగా నటించి, అందరి ఆశీర్వచనాలను పొంది కొద్దికొద్దిగా ముందంజ వెయ్యడానికి ప్రయత్నిస్తాను. భవిష్యత్తును గూర్చి యిప్పుడే చెప్పడం కష్టం. బాగా వుండగలదనే నమ్మకం వుంది. 'అంతా నాడి లీల', మన చేతిలో ఏముంది?

ప్ర : మీరు ప్రస్తుతం ఎన్ని చిత్రాల్లో నటిస్తున్నారు?

వి : తెలుగులో రెండు. 1. ఇల్లు—ఇల్లాలు 2. సూర్యరాజ్ వారి చిత్రం.

తమిళంలో ఒకటి. రవిచందర్‌కి నాయికగా నటిస్తున్నాను.

ప్ర : మీకు ఎలాంటి పాత్రలంటే యిష్టం? ఎవరి నటనంటే యిష్టం?

వి : సాఫ్ట్‌రోల్స్ వెయ్యాలంటే యిష్టం. ఏ పాత్ర నిచ్చినా, వేస్తాను. నాగేశ్వరరావు, శివాజీ, రామారావు, వాణిశ్రీ లంటే యిష్టం.

ప్ర : దేముడిపై నమ్మకం వుందా?

వి : ఆయన్ని కొలవనిదే ఏ పనీ చెయ్యను. ఏడు కొండలస్వామిని ప్రతినిత్యం వందసార్లయినా ధ్యానిస్తాను.

**—ఇంటర్ వ్యూ : శ్రీనివాస్ ●**



కొత్త నటి విజయ.

## సినిమా

నాయుడాను, మిక్కిలినేని, అల్లురామలింగయ్య, నాగేశ్వరరావు నటిస్తున్నారు. వీరితోపాటు ఆంధ్రా నార్మన్‌విస్డమ్ రాజబాబు హాస్యనటన ఒక ప్రత్యేకత.

కె.వి.యస్.కుటుంబరావు డైరక్టు చేస్తున్న ఈ సెంటిమెంటల్ క్రైమ్ చిత్రానికి పుహళేంది తొలిసారిగా సంగీతదర్శకత్వం నిర్వహిస్తున్నారు. దేవరాజు ఛాయ, భాస్కరరాజు కళ, వీరప్ప కూర్పు, దాసం గోపాలకృష్ణ రచన, వి. యస్. బోస్ అసోసియేట్‌గా పని చేస్తున్నారు.

ఏలూరు, ఈదర వెంకట్రామయ్య సమర్పిస్తున్న యీ చిత్రాన్ని నిర్మలా ఫిలింస్ ఆంధ్రలోనూ, శ్రీగౌరీ సీడెడ్‌లోను, ఉషాఫిలింస్ నైజాంలోను, రాజా కంబైన్సు నెల్లూరులోను, రాజేశ్వరి పిక్చర్సు చిత్తూరులోను విడుదల చేస్తారు.

## ఉత్తేజ పరిచే కథ

పసివాని పగ ప్రతి యువకుని ఉత్తేజపరచగలదు. ప్రతి కుటుంబానికి ప్రత్యేక ఆకర్షణ కాగలుగుతుంది. తన తల్లిని, తండ్రిని చిత్ర హింసలు పాలు చేసిన దుండగీడ్ని అదేవిధంగా పట్టి చిత్రహింసలు పాలుచేసిన ఈ 'పసివాని పగ' గుండెలు కదలిస్తుంది. శభాష్ అనిపిస్తుంది. చకచక షూటింగ్ జరుగుతున్న ఈ చిత్రం త్వరలోనే విడుదల కాగలదు.

## ఇల్లు-ఇల్లాలు పూర్తయింది

నందినీ ఫిలింస్ నిర్మిస్తున్న 'ఇల్లు—ఇల్లాలు' షూటింగు సెప్టెంబరుతో పూర్తయింది. ఈ చిత్రంలో వాణిశ్రీ ద్విపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ. కె. సుబ్బిరెడ్డి సమర్పించే ఈ చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజు, గుమ్మడి, సూర్యకాంతం, రాజబాబు, రమాప్రభ, అల్లురామలింగయ్య, లీలారాణి, మరియు క్రొత్తనటి విజయ ముఖ్య పాత్రధారులు.

ఇంటిని, ఇంటి యజమానిని, సంరక్షించుకొనే శక్తి ఇల్లాలికి మాత్రమే చేతనవుతుంది అనేడి నిజాన్ని చాటిచెప్పే చక్కటి కుటుంబ చిత్రమే 'ఇల్లు—ఇల్లాలు'. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో తయారైన ఈ చిత్రం అక్టోబరులో విడుదలవుతుందని అన్నారు నిర్మాణ సారధి పి. వి. రమణయ్య. ఈ చిత్రానికి ఆరుద్ర, అప్పలాచార్య మాటలను, మహదేవన్ సంగీతాన్ని, కృష్ణారావు కళను, సుఖదేవ్ ఛాయనులు నిర్వహించారు. నిర్మాతలు జె. వి.రామసుబ్బయ్య, యన్. సుబ్బరాయుడు.

మీ దగ్గరేదైనా కథ వుందా, వుంటే ఆ కథను నందినీ ఫిలింస్‌కి పంపండి. లేదా స్వయంగా సంప్రదించండి. ఈ సంస్థ నిర్మించబోయే మూడవ చిత్రానికి కథ అవసరం. కాబట్టి ఈ అవకాశాన్ని జారవిడవకండి. కథలో గ్రామీణ జీవితానికి ఎక్కువ ప్రాధాన్యత వుంటే మంచిది, అన్నారు నందినీ అధినేత సుబ్బిరెడ్డి.

—శ్రీనివాస్ ●

ఇది ఒక్కటే

100% TERENE

అల్లిక చొక్కా గుడ్డ-

space king! by Cottex®

గాలి ఆడే నేత. 100%
'టెరీన్' అల్లికను తోడు క్రొత్త
డిజైనులు మరియు మువ్వన్నెల నేసే
రంగులలో దర్శ్యాయైనవి...
'స్పేస్ కింగ్' అల్లిక చొక్కా
గుడ్డలు, సొగసైన దుస్తులు
వేసుకొనే సరసులైన వారికి తగినవి.

కోట్టెక్స్ ప్రైవేట్ లిమిటెడ్
(యూనివర్సల్ టెక్స్టైల్స్ నార
ఒక విభాగము)
రైఫల్ రేంజ్, ఎల్.బి.ఎస్. మార్గ్
ఘాట్‌కోపర్, బొంబాయి-86.

వ్యాపార వివరములకు వ్రాయండి.
ఎస్. ఎస్. మాండెల్వా
203, కల్బాదేవి రోడ్, బొంబాయి-2

డిస్ట్రిబ్యూటర్లు: చెల్లారామ్స్, 3/4, గోడౌన్ స్ట్రీట్, మద్రాసు • రాజా మార్కెట్ చిక్‌పేట్, బెంగుళూరు • ఆబిడ్ రోడ్, హైదరాబాదు.
తుల్సీదాస్ వి. పటేల్, నవీ గల్లీ, స్వదేశీ మార్కెట్, కల్బాదేవి రోడ్, బొంబాయి-2. లాల్ ట్రేడర్స్, 23, కకడ్ మార్కెట్, కల్బాదేవి రోడ్, బొంబాయి-2. ద్వారకాదాస్ రామేశ్వర్ గోయెంకా, 258, కల్బాదేవి రోడ్, బొంబాయి-2

గట్టుమీదే నిలబడాలి !'

కాంచన కొంచెందూరం వెళ్ళి అక్కడ గట్టుమీద నిలబడింది.

'నీపేరు గోపి నువ్వు వెళ్ళి ఆ చెట్టు కింద నిలబడాలి' అని డైరెక్టరు చెప్పగా ప్రసాద్ వెళ్ళి చెట్టుకింద నిలబడ్డాడు.

డైరెక్టరు ముందు కాంచనదగ్గరకు వెళ్ళాడు.

'ఇక్కడ కాదు. ఇంకా వెనుకను ఉన్న ఆ గట్టుమీదకు వెళ్ళాలి.'

డైరెక్టరు చెప్పిన ప్రకారం కాంచన వెనుకను ఉన్న గట్టుమీదకు వెళ్ళింది.

'నేను 'స్టార్ట్' అనగానే నువ్వు రెండు చేతులు ముందుకు చాపి 'గోపీ' అని కేక వేసి నేను ఉన్నచోటికి పరుగెత్తుకు రావాలి. అక్కడకు గోపీ కూడా వస్తాడు. మీ యిద్దరు కలుసుకోగానే ఒకళ్ళనొకళ్ళు గట్టిగా పట్టుకోవాలి. తరువాత నువ్వు మెల్లా మెల్లగా 'గోపీ' అనాలి వెంటనే గోపీ 'లీలా' అంటాడు. తరువాత నువ్వు 'నిన్ను విడిచిపెట్టి నేను బ్రతకలేను' అనాలి. ఆతరువాత నేను 'ఓకే' అనగానే వదలివేయాలి' తెలిసిందా ?'

'తెలిసింది' అన్నట్టుగా కాంచన కొంచెం సిగ్గుతో తల ఊపింది.

తరువాత డైరెక్టరు, ప్రసాద్‌వద్దకు వెళ్ళాడు.

నేను 'స్టార్ట్' అని అనేవరకు నువ్వు యిక్కడే నిలబడాలి. నేను 'స్టార్ట్' అనగానే నువ్వు రెండుచేతులూ ముందుకు చాపి 'లీలా' అని గట్టిగా పిలచి నేను ఉన్నచోటికి పరుగెత్తుకొని రావాలి. అక్కడకు లీలకూడా వస్తుంది. అక్కడ మీ యిద్దరూ ఒకళ్ళనొకళ్ళు గట్టిగా పట్టుకోవాలి. అప్పుడు లీల 'గోపీ' అంటుంది. తరువాత నువ్వు 'లీలా' అని మెల్లగా అనాలి. వెంటనే లీల 'నిన్ను విడిచిపెట్టి నేను బ్రతకలేను' అంటుంది. తరువాత నువ్వు 'మా నాన్నను యెదిరించి అయినా సరే నిన్నే పెళ్ళి చేసికొంటాను' అనాలి. ఆతరువాత నేను 'ఓకే' అనగానే వదలివేయాలి. తెలిసిందా?' అని ప్రశ్నించాడు డైరెక్టరు.

'ఓకే' అన్నాడు ప్రసాద్ మంచి ఉత్సాహంగా.

ఒకరితో ఒకరు చెప్పకోదలచిన మాటలనే డైరెక్టరుకూడా అనమని అన్నందుకు కాంచనకు ప్రసాద్‌కుకూడా చాలా సంతోషంగా ఉంది.

డైరెక్టరు వారి యిద్దరి మధ్యకూ వచ్చి 'స్టార్ట్' అన్నాడు.

డైరెక్టరు చెప్పినట్టుగానే కాంచన 'గోపీ' అని కేకవేసి పరుగెత్తుకొని వచ్చింది ప్రసాద్‌కూడా 'లీలా' అని కేకవేసి అక్కడకు పరుగెత్తుకొని వచ్చి కాంచనను కౌగలించుకొన్నాడు. తరువాత కాంచన కొంచెం సిగ్గుతో ప్రసాద్ భుజాలమీద చేతులువేసి 'గోపీ' అన్నది ప్రసాద్ 'లీలా' అన్నాడు 'నిన్ను విడిచి పెట్టి నేను బ్రతకలేను' అన్నది కాంచన. 'మా నాన్నను యెదిరించి అయినా సరే నిన్నే పెళ్ళాడతాను అన్నాడు ప్రసాద్.

అంతలో డైరెక్టరు 'కట్' అన్నాడు కాని కాంచన ప్రసాద్ ఒకరి నొకరు విడిచి పెట్టలేదు.

అప్పుడు డైరెక్టరు వారికి బాగా దగ్గరకు వచ్చి 'నేను 'కట్' అనగానే మీరు వదలివేయాలి' అని గట్టిగా అని మళ్ళా దూరంగా వెళ్ళి 'కట్' అన్నాడు.

కాంచన ప్రసాద్ అప్పుడు విధిలేక ఒకరినొకరు వదలివేసి దూరంగా నిలబడ్డారు.

'లీలా ! గోపీ నిన్ను పట్టుకొన్న తరువాత ఆలస్యంగా అతని భుజాల మీద చేతులు వేశావు. అలాగ ఆలస్యం చేయకూడదు. మీరు యిద్దరూ ఒకేసారి గట్టిగా ఒకళ్ళనొకళ్ళు పట్టుకోవాలి, తెలిసిందా ?' అన్నాడు డైరెక్టరు.

'ఊ' అన్నది కాంచన.

'డైరెక్టరుగారు చెప్పినట్లు నన్ను గట్టిగా వెంటనే పట్టుకో. లేకపోతే డైరెక్టరుగారికి కోపం వస్తుంది.' అని కాంచన వైపు కొంటెగా చూస్తూ ఆమెను హెచ్చరించాడు ప్రసాద్.

'చూశారా? నా తడాఖా యిప్పటికైనా మీకు తెలిసిందా?' అన్నట్టుగా డైరెక్టరు వాళ్ళవైపు ఒకసారి చూచి 'మళ్ళా మీ చోటుకు మీరు వెళ్ళండి' అన్నాడు.

కాంచన మళ్ళా గట్టుమీదకు ప్రసాద్ తిరిగి చెట్టుకిందకు వెళ్ళారు.

డైరెక్టరు మధ్యను నిలబడి 'స్టార్ట్' అని కేకవేశాడు.

'గోపీ' అని కేకవేస్తూ కాంచన పరుగెత్తుకొనివచ్చింది.

'లీలా' అని కేకవేస్తూ ప్రసాద్‌కూడా పరుగెత్తుకొనివచ్చి కాంచనను కౌగలించుకొన్నాడు. ఈసారి కాంచన ఆలస్యం చెయ్యలేదు.

'ప్రసాద్' అన్నది కాంచన.

'కాంచనా' అన్నాడు ప్రసాద్.

'నిన్ను విడిచిపెట్టి నేను బ్రతకలేను' అన్నది కాంచన.

'మా నాన్నను యెదిరించి అయినాసరే నిన్నే పెళ్ళాడతాను' అన్నాడు ప్రసాద్.

'కట్' అన్నాడు డైరెక్టరు గాని కాంచన ప్రసాద్ ఒకరినొకరు విడిచిపెట్టలేదు.

డైరెక్టరు వాళ్ళకు బాగా దగ్గరగా వచ్చి 'కట్' అన్నాడు. అయినా ఫలితం కన్పించలేదు.

'మీరు పేర్లు తప్పు చెప్పారు అందుచేత కట్,' అని డైరెక్టరు బిగ్గరగా అరిచాడు అయినా ప్రయోజనం లేకపోయింది.

అప్పుడు డైరెక్టరుకు ఒక ఆలోచన వచ్చింది. 'ఈ అవుట్‌డోర్ ఆట అయిపోయిన తరువాత వాళ్ళు వెళ్ళిపోతారు, తాటిముంజల నిమిత్తం పావలా యివ్వడానికి బదులు రూపాయినోటు యిచ్చారు. తనే వాళ్ళకు ముప్పావలా యివ్వవలసి ఉంది. ఈ ఆట అయిపోయేవరకూ తాను అక్కడ ఉంటే ముప్పావలా తిరిగి యిమ్మనమని వాళ్ళు అడుగుతారు. అందుచేత వాళ్ళను యిలాగే వదలివేసి తాను వెళ్ళిపోతే తనకు ముప్పావలా మిగిలిపోతుంది' అని తనలో తాను అనుకొని డైరెక్టరు సింహాచలం మెల్లమెల్లగా అక్కడనుంచి జారుకున్నాడు.

'డైరెక్టరు ఉన్నాడా? వెళ్ళిపోయాడా?' అని గమనించే పరిస్థితిలో కాంచన, ప్రసాద్ లేరు.

'ప్రసాద్' అని మళ్ళా అన్నది కాంచన.

'కాంచనా' అన్నాడు ప్రసాద్ కౌగిలిని యింకా బిగిస్తూ.

'నిన్ను విడిచిపెట్టి నేను బ్రతకలేను.'

'మా నాన్నను యెదిరించి అయినాసరే నిన్నే పెళ్ళిచేసికొంటాను.'

**(ఇంకా ఉంది)**







### జరిగిన కథ

తల్లికి ఇష్టంలేకపోయినా ఎం. ఎ. లో చేరాడు విద్యార్థి. తన అన్నకూతురు లక్ష్మిని విద్యార్థి వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడాలని ఆమె సంకల్పం. కాని, లక్ష్మి ఎవరినో ప్రేమిస్తున్నట్లు తెలుసుకున్న విద్యార్థి, మేనమామతో వాదం పెంచుకొని తిరిగి వచ్చేస్తాడు. మెడిసిన్ చదువుతున్న ఆనంద్ అతని రూమ్మేటు. అతని ద్వారానే సుందరి పరిచయమవుతుంది విద్యార్థికి. మామయ్య అప్పు తీర్చేటప్పటికి బాంకులో డబ్బు అయిపోయింది. ఇక ముందు చదువుగతి ఏమిటని విచారంలో మునిగిపోతాడు విద్యార్థి. గదిలో జరిగిన దొంగతనంవలన వేరే గది తీసుకుంటాడు. సత్యం కూ అతన్ని పొరుగది గా మారుస్తుంది. ప్రెయివేటుగా ఎం. ఏ. చదివే జ్ఞానాంబతో అతని పరిచయం పెరుగుతుంది. లక్ష్మి మోసపోయిందని తెలుస్తుంది. జ్ఞానాంబ విద్యార్థిని బాగా ఆకర్షించింది. అందుకే చనువు పెంచుకోసాగాడు. జ్ఞానాంబ ఆశయం విని విద్యార్థి ఆశ్చర్యపోయాడు. జ్ఞానాంబ మాటలతో విద్యార్థికి ధైర్యం వచ్చింది. లక్ష్మి తన కథంతా చెప్పింది జ్ఞానాంబతో. ముగ్గురూ ఒక్కటయ్యారు. కుటుంబానికి సంబంధించిన ఇబ్బందుల వల్ల విద్యార్థికి ఇంక చదవాలనిపించదు.

## 15

క్షణంసేపు లక్ష్మి జ్ఞానాంబా యిద్దరూ అవాక్కయి నిలబడ్డారు ... అతడ్ని ఆపడమెలాగో యిద్దరికీ తెలియలేదు... ఇంతలో ఏదో తోచినట్లు, 'ఒక్కక్షణం కూచో బావా ... కాఫీ పట్టుకొస్తాను.' అంటూ జవాబుకోసం ఎదురు చూడకుండా లోపలికి పరుగెత్తింది లక్ష్మి.

మాట్లాడకుండా ఏదో ఆలోచిస్తున్న జ్ఞానాంబను చూచి.

'మీకు నామీద చాలాకోపం వచ్చింది కదూ?' అన్నాడు మృదువుగా...

'హుఁ... ఓడిపోయి పారిపోయ్యేవాళ్లను చూస్తే అంతకంటె ఏమి రావాలో ?' అంది జ్ఞానాంబ యింతదాకా మనసులోనే అణుచుకోడానికి ప్రయత్నిస్తున్న బాధనంతా ఆ రెండు మాటల్లో వెళ్ళగక్కుతూ...

నిజానికి అతడు చదువు మానేస్తున్నానని చెప్పినప్పటి నుంచి ఆ అమ్మాయి మనసు ఏదో ప్రియమైన వస్తువును కోరి దూరం చేసుకున్నట్లు బాధపడుతోంది ..

'మా పరిస్థితి మీకు యిదివరికే చెప్పాను జ్ఞానాంబగారూ...మొన్న నాట్లకు కూడా అమ్మనగలు తాకట్టు పెట్టాల్సి వచ్చింది... అదీ ఏం చెయ్యాలని నేను దిగులుపడుతుంటే మా అమ్మ చెప్పింది వాటిని తాకట్టు పెట్టి డబ్బు తెమ్మని ... నాట్లకుపోగా మిగిలింది కోతలదాకా కావాలిగా...ఇక ఏం చెయ్యను?... రెండోపంట దెబ్బతినడం, అక్కయ్య పురుడు వీటితో నా అంచనాలు పూర్తిగా తారుమారయ్యాయి జ్ఞానాంబగారూ.'

'హుఁ...' దీర్ఘంగా నిట్టూర్చాడు విద్యార్థి...'అమ్మ చదువు మొదలుపెట్టేటప్పుడే అంది... 'నీ జాతకంలో పైచదువు చదివే గీతలే'దని...ఆనాడు వినలేదు ...అందుకే అంటారు పెద్దలమాట పెరుగన్నం మూట అని...'

'జాతకంలో వున్నది సాధించటం మీ గొప్పకాదు విద్యార్థిగారూ ... అది మీరంటారు' చూడండి ఆ 'దేముడి దయ'...విధి ప్రసాదితం...కాని జాతకంలో లేనిది సాధించినప్పుడే మన గొప్ప, మనుషుల గొప్ప.'

'ఇంతలోనే లక్ష్మి కాఫీ తెచ్చింది ముగ్గురికీ.'

'లక్ష్మీ!... ఈ శుభవార్త చెప్పినందుకా కాఫీ?' అన్నాడు గ్లాసు అందుకుంటూ.

'కాదులే ... నీలా మధ్యలో చదువుకు 'టాటా బైబై' చెప్పకుండా మా జ్ఞానాంబగారు చదువు కొనసాగిస్తున్నందుకు ఆనందంగా...' తపీమని జవాబిచ్చింది లక్ష్మి...

'లక్ష్మీ!...మీ బావగారి జాతకంలో పైచదువు చదివే గీత లేదని ఎప్పుడో చెప్పారుట వాళ్ళమ్మ ... పాపం ఆయనేం చేస్తారు?... పోనీ జాతకం చెప్పినట్లైనా బుద్ధిగా నడుచుకోక ... అప్పుడేమో పెద్ద పందెం వేసారుట ... ఇప్పుడేమో...' హేళనగా జ్ఞానాంబ అంటుంటే...

'పరుగెత లేక విరమించుకున్నారట ... అవునా! ఓహో!...గొప్ప వీరుడివి బావా!... త్రీ ఛీర్స్ టు యూ...' అని పూర్తి చేసింది లక్ష్మి...

విద్యార్థి చిన్నగా నవ్వాడు

'ఇదుగో...అమ్మాయిలూ!... మీరిద్దరూ ఎంత వెక్కిరించినా, ఎన్నిమాటలన్నా, ఆరిపోయిన నిప్పు రాజుకోదు తెలుసా?...' అన్నాడు.

'అబ్బ! ... ఎంత అమాయకులమైనా, ఎవరు ఆరిపోయిన బొగ్గో, ఎవరు నివురు గప్పిన నిప్పో తెలియని పరిస్థితిలో లేములే బావా...' అంది లక్ష్మి విస్ఫూర్తంగా ...

'అమ్మా!... మరదలు పిల్లా! ... అంత అభిమాన మున్నదానివి... ఏదీ మీనాన్నగారి చేత ఏ రెండుమూడువేలో అప్పు యిప్పించరాదూ, ఈసారి ఆయన అడగకముందే తీర్చేస్తానులే భయపడకు .' అన్నాడు పరిహాసంగా.

ఖాళీ కాఫీగ్లాసు అందుకొని గిరుక్కున తిరిగింది లక్ష్మి ... మళ్ళీ మరు నిముషంలో గాలి దుమారంలో లోపలినుండి వచ్చిపడింది...వస్తూనే,

'మళ్ళీ ఎక్కడో వున్నవారిని, అభిమానం చంపుకుని దేహీ అనడమెందుకుగాని అవ

హ్యంగా...ఇదుగో జ్ఞానాంబగారు నాచేత బలవంతంగా పొదుపుచేయించిన డబ్బు ... రెండువందలున్నాయి తీసుకో బావా...దీంతో ఫీజుకట్టేయి...ఇక నెలనెలా అంటావా... యీ సంవత్సరం నాజీతం మూటపాతిక చేశారు...నెలనెలా నా జీతంలో ఓ యాభై యిస్తాను...ఎట్లాగో గడుపుకుందాం ... చేరు బావా.' అంది లక్ష్మి డబ్బు అతడి చేతిలో పెడుతూ.

'నిజమే విద్యార్థిగారూ...తీసుకోండి... నాదగ్గరకూడా అక్కయ్యను అత్తగారింటికి పంపడానికి దాచింది వెయ్యిరూపాయలు పైనేవుంది బాంకిలో...మీకెంతకావాలో తీసుకోండి...వంటలొచ్చాక తీర్చవచ్చు...ఎలాగో అప్పగానే కాబట్టి మీరు అభ్యంతరం చెప్పాల్సిందిగూడా ఏమీలేదు...' అంది జ్ఞానాంబ ఏదో మార్గం సూచించగలిగాముగదా అన్న తృప్తితో...

రెండునిముషాలపాటు బొమ్మలా చేతిలో వున్న డబ్బునే చూస్తూ కూర్చున్నాడు విద్యార్థి...

ఆ తర్వాత ఆ డబ్బును లక్ష్మిదగ్గర పెడుతూ.

'మీ యిద్దరి అభిమానానికి చాలా చాలా థాంక్స్...' అన్నాడు ఆప్యాయిత అభిమానం కురిసే స్వరంతో గద్గదికంగా... అతడి కళ్లల్లో నీళ్లు నిండుకున్నయి.

వెంటనే లేచి, 'వస్తాను లక్ష్మి ... జ్ఞానాంబా...ఎల్లుండివచ్చి ఫీజు కట్టేస్తాను' అంటూ జవాబుకైనా ఎదురు చూడకుండా వెళ్ళిపొయ్యాడు...

అతడు సత్యం గదికిచేరుకునేసరికి సత్యం 'స్టౌ' అంటించి అత్తెసరు పడేస్తున్నాడు ...పక్కనే లోకన్‌బాబు కత్తితో బంగళా దుంపలు ముక్కలు తరగడానికి ప్రయత్నం చేస్తున్నాడు...

విద్యార్థి వస్తూనే, 'ఇదెప్పటినుండీ ? ...' అని అడిగాడు ఆశ్చర్యంగా...

'ఎప్పట్నుండా?...ఇదుగో మీ ఫ్రెండ్ బుర్రకి 'ఎకానమీ' పూరాగా పట్టినప్పటి నుంచి...' నవ్వుతూ జవాబిచ్చాడు లోకన్ బాబు.

'పోనీ మీరు హోటల్లో భోంచెయ్యక పొయ్యారా యీ గొడవంతా మా ఫ్రెండ్‌కే వదిలేసి?' అని అడిగాడు విద్యార్థి నవ్వుతూనే...

'అదేంటి గురూగురూ ... అలా సెలవిస్తారు !...ఇది ఉభయతారకం...ఇటు ఎకానమీ...అటు సత్యం చేతివంట రుచి చూసినట్లూ అవుతుంది...ఇక అయ్యా పొయ్యా యీనాటి కార్యానిష్టుల కార్యానులు అమ్మాయిల వంటబడితె ముందు ముందు కూడా వుపయోగపడుతుందని ... నేనిలా ఎన్నిసార్లు క్షతగాత్రుడ్ని అయినా, యీ కూరలూ కత్తి వదలకుండా పట్టుకుంటే...' అన్నాడు లోకన్‌బాబు బొటన వ్రేలికిపడ్డ గాట్లు చూపిస్తూ.

'అప్పు నా యివ్వాళ అగస్టు పదిహేను ...సెలవుకదా ...ఇవ్వాళొచ్చావేం జీతం కట్టడానికి?...' అని ప్రశ్నించాడు సత్యం.



'లేదురా ... అసలు జీతం కట్టడానికి రాలేదు...రేపు ఎంప్లాయిమెంట్ ఆఫీసులో రిజిస్టరు అవుదామని వచ్చాను ... కానీ యిక్కడికొచ్చాక అనిపిస్తోంది ... పోనీ ఏమయితే అదయింది చేరుదామా?... అని నీ సలహా అడగాలనే వచ్చాను.'

'జాబ్‌లో చేరితే చదవడం కష్టంరా... పైగా లెక్చరర్స్ గైడెన్సు లేకుండా క్లాసు రావడం కష్టమే...అందులో అంత పూర్ రిజల్టు వచ్చినప్పుడు పాసయ్యావా... మానకురా... కంటిన్యూ చెయ్యి ... ఎంత ఒక్క సంవత్సరం వోపిక పడితే అయిపోతుంది ... అయినా వుద్యోగాలు మాత్రం మనకోసం రెడీగా కాచుక్కూచున్నాయి గనుకనా?' అన్నాడు.

'కానీ...మీ పరిభాషలో చెప్పాలంటే... యిప్పటికే డెబిట్‌సైడ్ స్టార్టు చేశానురా...ఆ అప్పు చాలక మళ్ళీ చెయ్యాలంటే భయం వేస్తోంది తీర్చగలనా అని ... అదీ కాక అమ్మ సొమ్మంతా యిప్పుడు తాకట్టులోనే వుంది ... ఇంక అప్పుపుట్టే మార్గం కూడా ఏంలేదు.'

'లాండ్ మార్ట్‌గేజ్ బాంకిలో ప్రయత్నించక పొయ్యావా?'

'అదీ అయింది... వాకబు చేస్తే నెలల కొద్దీ తిరుగుతున్నవాళ్ళకే గతి లేదుట ... అందుకే ఆ ప్రయత్నం విరమించుకున్నాను.'

'అటువంటివాటికి 'పెద్దల రికమండేషను' లేకుండా ఎలా వస్తాయోయ్ నీ పిచ్చిగానీ' అన్నాడు లోకన్‌బాబు కల్పించుకుని...

'మరే...ఆమాటా నిజమే ... అయితే యిప్పుడేం చెయ్యాలని? ... పోనీ ఎవరన్నా వడ్డీకిచ్చేవాళ్ళదగ్గర కనుక్కుంటావా? ... వడ్డీ రెండూమూడూ అడిగితే మరీ ఎక్కువవుతుందేమోరా' అన్నాడు సత్యం.

'వర్లేదు గురూగారూ ... సందేహించకండి...అప్పుచేసి డాంబికంగా తిరగడం ఈ రోజుల్లో గొప్పవాళ్ళయ్యే లక్షణాల్లో ఒకటి ... కొద్దోగొప్పో అయినా అప్పులేని మధ్యతరగతివాళ్ళు ఎవరున్నారండి ?...' అన్నాడు లోకన్‌బాబు, కూరతరగడం పూర్తిచేసి, అది అన్నం కలియబెడుతున్న సత్యం దగ్గరకుతోస్తూ,

'ఇంకో గత్యంతరం కన్పించటం లేదు...అదే చెయ్యాలి' అన్నాడు విద్యార్థి.

'అయితే ఈ నాలుగునెలలకూ సరిపోయేట్లుగా ఒక వెయ్యో ఎంతో తీసుకోరా ... కాలేజి జీతానికీ, పుస్తకాలకూ మూడువందలు పోయినా, అబ్బో చాలా వుంటుంది. అంత దొరక్కపోతే యిప్పటికి ఒక్క ఆరువందలు దొరికినా నాలు... పంటలు రాగానే ముందు ఆ బాకీ తీర్చొయి...' అని సలహా యిచ్చాడు సత్యం.

'అదే అనుకుంటున్నాను...అయితే ఆరువందలు చాలంటావా... అవునుగానీ... ఈ పద్ధతి, ఈ చెయ్యి కాల్చుకునే పద్ధతి ఏమన్నా లాభదాయకమేనంటావా ?'

'ఫర్వాలేదు ... కొంత కలిసొస్తుంది... అయితే కాస్త కష్టపడాలి ... అంతే... ఎలాగో మీరుకూడా బియ్యం కొనక్కరలేదుకదా ... మీవూరినుండి నెలకోసారి బియ్యం, పచ్చళ్ళూ అవీ తెచ్చుకున్నారా... ఎట్లాగో కాలం గడిపెయ్యవచ్చు.'

'సరే...అట్లాగే చేస్తాను ... అయితే యిక నే వెళ్తానురా ... ఆఫీసులో పని లేనప్పుడు రేప్పొద్దుటిదాకా యిక్కడెందుకు? ... రాత్రి లాస్ట్‌బస్‌కు వూరికి వెళ్ళిపోతాను' అన్నాడు విద్యార్థి.

'ఇప్పుడెక్కడికి వెళతారండీ? వుండండి... రాత్రికి మీ సత్యం చేతివంట రుచి చూసి రేప్పొద్దున వెళ్దురుగానీ...' అన్నాడు లోకన్‌బాబు.

'అవున్రా...యిప్పుడెక్కడికి పోతావ్ ?... చాల్రోజులైంది..ముగ్గురంకూచుని కబుర్లు చెప్పుకుంటూ పడుకుందాం... అవునుగానీ నీ గదినేం చేశావ్?' అని అడిగాడు సత్యం.

'గది దిగులులేదులే... ఈ రెండునెల్లూ యింటివాళ్ళకే గది అవసరమని వాళ్ళే వుంచుకుంటామన్నారు. ఎప్పుడుకావాలంటే అప్పుడొచ్చి తాళం వేసుకోమని చెప్పారు.

ఆరాత్రికి అక్కడే భోజనం చేసి పడుకుని తెల్లవారి వూరికి వెళ్ళిపొయ్యాడు విద్యార్థి ...అప్పటికప్పుడు పొలం తాకట్టుపెట్ట డానికి దస్తావేజులూ అవీకావు కాబట్టి అప్పటికి ఆ వూరి ప్రెసిడెంటు దగ్గర మూడువందలురూపాయలు చేబదులుగా తీసుకుని వచ్చి ఫీజు కట్టేశాడు. ఈసారి కాలేజీలో చేరతానన్నప్పుడు ధనమ్మగారు ఏమీ అనలేదు. ఆవిడ మౌనం అతడికి ఆశ్చర్యం కలిగించింది. ఏమైనా తల్లికదా ... తన బిడ్డలు పైకి రావాలని పెద్ద చదువులు చదవాలనీ ఏ తల్లికోరుకోదూ...అని సరిపెట్టుకున్నాడు...కాలేజి ఫీజుకట్టినప్పుడే, కొత్తగా కాలేజికివేస్తున్న బస్సుకుకూడా 'పాస్' కొనేశాడు...సామాన్లవీ తీసుకొచ్చుకోడానికి మళ్ళీ యింటికి వెళ్ళిపొయ్యాడు.

ధనమ్మగారు కూతుర్ని పురుటికి గుంటూరు తీసుకు వస్తూ, రెండోకూతురు ఆశకు, చిన్నకొడుక్కు తోడుగా వుంటుందని, దూరపుచుట్టం అయిన ఒక ముసలమ్మగార్ని యింట్లో పెట్టి వచ్చింది. ధనమ్మగారు వూరికి వెళ్ళిపొయ్యాక ఆ ముసలమ్మగారు వాళ్ళింటికి వెళ్ళిపోయింది. ఒకరోజు ఆవిడే యింట్లో ఒక భాగం అద్దెకిస్తారేమోనని అడగడానికి వచ్చింది. వాళ్ళకు తెలిసినవాళ్ళ, పంచాయతిసమితిలో వుద్యోగమట ... ఆ వూరికి బదిలీ అవడంతో మంచి 'లొకాలిటీ'లో యిల్లు చూడమని రాయడంతో ఆవిడ ధనమ్మగారిల్లు అడిగింది. అయితే ధనమ్మగారికి యిల్లు అద్దెకిచ్చుకోడం పరువు తక్కువనిపించింది. అందుకే, 'ఛ !... మాకేం ఖర్మ యిల్లు అద్దెకిచ్చుకోడం ?' అని తిప్పి పంపించేసింది ముసలమ్మగారిని. అయితే అది విన్న విద్యార్థికి మెరుపు లాంటి ఆలోచన తట్టింది. వెంటనే వాళ్ళమ్మదగ్గరకు వెళ్ళి 'అమ్మా!...యిల్లు అద్దెకిచ్చుకోడం పరువు తక్కువేమిటమ్మా ...ఒకరినెత్తిన చేతులుపెట్టి డబ్బుగడిస్తే తప్పు...ఒకరిని పీడిస్తే తప్పు... అంతేగానీ ...మనకున్న సౌకర్యాలలో కొన్నిటిని తగ్గించుకోడం, భేషజాలు కట్టిపెట్టి సర్దుకుపోవడంలోనూ తప్పేం లేదమ్మా' అంటూ ఆవిడకు నచ్చచెప్పాడు.

చివరికి ఎలాగో ఆవిడను ఒప్పించగలిగాడు. ఆ అద్దె డబ్బు కనీసం అక్కడ ధనమ్మగారి చేతి ఖర్చుకైనా వుంటుందని విద్యార్థి ఆశ. అందుకనే ఆశద్వారా ఆ ముసలమ్మగారికి మళ్ళీ కబురుపెట్టి ఆవిడతో మాట్లాడి అన్నీ ఏర్పాట్లుచేశాడు... ఆ తర్వాత సామానంతా ఒకపక్క మూడు గదుల్లో సర్దేసి, మిగతా మూడుగదుల్నూ వంచలో వగ్గందాకా తడికపెట్టి అదీ అద్దె

కిచ్చాడు...

సెప్టెంబరు ఫస్టునుండీ క్లాసులు మొదలెడ్తారని వినగానే, ఒక బస్తాకు సామాను, బియ్యం, పప్పులూ, పచ్చళ్ళూ, కందిపొడీ వగైరా వరుకులూ తెచ్చుకున్నాడు. సామాను సర్దుతుంటే, 'నేను కూడా గుంటూరు వస్తానన్నయ్యా... అక్కడ నీకు వంటచేసిపెట్టి నేను చదువుకుంటాను.' అన్నది ఆశ. 'ఇప్పుడుకాదు లెమ్మా...నువ్వు ఎస్సెల్సీ పాసయితే కాలేజిలో అక్కడ జేర్పిస్తాను' అని నచ్చచెప్పి ఆ అమ్మాయిదగ్గరే వంటచేసే పద్ధతులు రాసి తెచ్చుకున్నాడు. కాని మొదటరోజు పలుకైంది. కూరమాడి బొగ్గయింది. రెండోరోజు అన్నం గంజిలా తయారయి, కూర అసలు వుడకనే లేదు. ఇలా కాదని జ్ఞానాంబవాళ్ళను తీసుకెళ్ళి పాకశాస్త్రం లోని ప్రాథమిక సూత్రాలు నేర్చుకున్నాడు.

అయితే కాలేజిలో చేరిన విద్యార్థికి ఎంత వద్దనుకున్నా ఖర్చులు తప్పలేదు. 'ఫైనలియరు'కు పనికివచ్చే పుస్తకాలు కాలేజి లైబ్రరిలోకూడా కొంచెమే వున్నందున పుస్తకాలు కొనక తప్పలేదు. ఈలోపల యిల్లు తాకట్టుపెట్టి రెండురూపాయల వడ్డీచొప్పున రెండువేలు అప్పు తీసుకున్నాడు. ఒక వెయ్యిరూపాయలు పొలం ఖర్చులకు అప్పే పెట్టాల్సి వచ్చింది. ఈమధ్య పొలంమీద రాబడి తక్కువా, ఖర్చులు ఎక్కువా అవుతున్నాయి. ఆ ఏడు రెండోపంట బాగా దెబ్బతిన్నది. వడ్లమీద డబ్బు అక్క పురిటితో అయిపోయింది. ఇక వాట్లకు కూడా ధనమ్మగారి నగలు కొన్ని తాకట్టు పెట్టాల్సి వచ్చింది. అందుకనే ఒకవెయ్యి యింటి ఖర్చుకూ, ఎరువులూ, కోతలూ నూర్పిళ్ళూ వగైరాకు తీసిపెట్టి, మిగతా వెయ్యిలో మూడు వందలు చేబదులు తీర్చేసి, ఒక వంద పెట్టి మామూలు బట్టలు నాలుగు జతలు కుట్టించుకున్నాడు. సెప్టెంబరులో క్లాసులు మొదలెట్టగానే అతడు జ్ఞానాంబతో ఒక వప్పందం చేసుకున్నాడు. దాని ప్రకారం జ్ఞానాంబ సగం పుస్తకాలు, తను సగం పుస్తకాలూ కొనేట్టు... 'రిజర్వ్ లైబ్రరీ'లో యిద్దరూ 'సబ్ స్క్రైబర్స్' కాబట్టి 'రెఫరెన్సు' పుస్తకాల దిగులు లేదు. 'ఫైనలియరు'లో 'అమెరికన్ లిటరేచరు' ఒక పేపరు. ఇద్దరూ 'యు. ఎస్. ఐ. ఎస్.లో లైబ్రరీ కార్డు తెచ్చుకున్నారు. అయితే వాళ్ళు పుస్తకాలు తెచ్చుకోగానే గుంటూరులో వున్న ఈ అమెరికన్ కల్చరల్ సెంటర్ ఎత్తేస్తారని పుకార్లు బయలుదేరినయి.

ఆరోజున జీతం కట్టడానికని రెండు వందలరూపాయలు తెచ్చియిచ్చినప్పటినుండీ అతడికి లక్ష్మి అంటే అభిమానం ఎక్కువైంది. అప్పటినుండీ ఆ అమ్మాయితో చేసిన ప్రతిజ్ఞ మాటిమాటికీ జ్ఞాపకం రాసాగింది. అందుకనే పెట్టె అడుగున పడున్న మధూ ఫోటోతీసి స్నేహితులకు చూపి, ఇతగాడెక్కడన్నా తగిలితే వెంటనే ఆచూకీ చెప్పమని అందరికీ చెప్పాడు. ఒక రోజు అతడు కాలేజీనుండి వచ్చేసరికి యిల్లుగలాయన పెద్దగా భార్యతో చెబుతున్నాడు. 'ఎక్కడికి పోతాడు? నిలబెట్టి వసూలు చేశాను. పైగా పెళ్ళిచూపుల కొచ్చాట్ట... పెళ్ళిచూపులకు.'

విద్యార్థికి అనుమానం వేసింది. ఆయన దగ్గరకు వెళ్ళి అడిగాడు...ఆ వెంటనే ఆయన 'ఏదేనండీ...మీకు ముందు గదిలో వుండీ అద్దెగ్గొట్టిపొయ్యాడు...మధూ... అతడే కొత్తపేటలో కన్పించాడు ... నిలబెట్టి వసూలుచేశాను. పైగా పెళ్ళి చూపులకొచ్చాట్ట యీ వూరు!'... అంటూ చెప్పుకొచ్చాడు.

'పెళ్ళిచూపులకా? ... ఎవరి పిల్లో ఏమిటో చెప్పాడాండి?' అని అడిగాడు విద్యార్థి ఆత్రుతగా.

'ఎవరిపిల్లో ఏమిటో నాకెందుకు చెబుతాడయ్యా నీపిచ్చిగానీ...అసలెలా దొరికాడనుకున్నావ్...కొత్తపేటలో ఒక వీధిలో ఓ యింట్లోంచి వస్తుంటే చూశాను. అతడేనేమోనని అనుమానం వచ్చింది ... వెంటనే కొంచెందూరంలో కాపేసి నిలబడ్డాను. బయటికి రాగానే నిలేశాను.' అని చెప్పాడాయన.

విద్యార్థి ఆ వివరాలు అడిగి తెలుసుకున్నాడు. మర్నాడు సాయంత్రం ఆ యింటిముందు తచ్చాడుతున్నాడు ... అతడికి ఆ యింట్లోకి ఎలావెళ్ళాలో, ఎలా పలుకరించాలో తెలియటంలేదు ... ఇల్లు చూస్తే చాలా ధనవంతుల యిల్లులా వుంది...ఆలోచిస్తూ నిలబడ్డాడు ఆవీధి చివర.

అంతలో అదృష్టంకొద్దీ ఆ ఇంట్లోంచి ఒకతను సైకిల్ తీసుకుని బయటకు వస్తూ కన్పించాడు...అతడుకూడా పి. జి. సెంటర్‌లో చదువుతున్నవాడే... ముఖ పరిచయం పురస్కరించుకొని, వెంటనే చిరునవ్వు నవ్వాడు విద్యార్థి పలకరింపుగా ... అతడూ ప్రతిగా చిరునవ్వు నవ్వాడు.



'మీది బోటనీ డిపార్ట్‌మెంట్ కదూ?...' మాట కలపడాకకి ప్రశ్నించాడు విద్యార్థి,

'కాదండీ...జువాలజీ... మీరు ఆర్ట్సే కదూ?'

'అవునండీ... ఇంగ్లీష్ లిటరేచరు ...' అని కాస్సేపాగి, 'యిది మీ యిల్లాండీ?' అని అడిగాడు విద్యార్థి.

'అవునండీ...మీ యిల్లుకూడా యీ పేటలోనేనా?' మళ్ళీ ప్రశ్నించాతడు.

'కాదండి బ్రాడీపేట...'

విద్యార్థి మాట్లాడుతూనే అతడి వెంట వస్తున్నాడు...కూడా మనిషి మాట్లాడుతూ వస్తుంటే సైకిల్ ఎక్కి ఎలా పోగలడతడు...అందుకని సైకిల్ నడిపించుకుంటూ పక్కనే నడుస్తున్నాడు.

'అయితే—మధూగారు మీ కేమవుతారండీ?...' వున్నట్టుండి ప్రశ్నించాడు విద్యార్థి.

'మధూగారా!...ఏ మధూగారూ ?... ఓహో మధు బాబా అంటారు ... బెజవాడలో బిజినెస్ చేస్తుంటారు? ... ఆయనేనా?' అని అడిగాడతడు...అతడికి విసుగ్గా వుంది... కాలేజీలో ముఖపరిచయం పురస్కరించుకుని, యిలా తన్ను సైకిల్ కూడా ఎక్కనివ్వకుండా వెంటబడ్డాడేమిరా అనుకుంటూ వస్తున్నాడు.

'ఆఁ... ఆయనేనండీ...' అన్నాడు విద్యార్థి.

'ఆహాఁ... ఆయనా... ఆయనకు మా చెల్లెల్ని యివ్వాలనుకుంటూన్నాం లెండి' అన్నాడతడు తుంచేసినట్లు...

'అతడికా?!' తృళ్ళిపడ్డాడు విద్యార్థి.

ఆ మాటలో ఏమి ధ్వనించిందోగానీ, 'వస్తానండీ ... పనుంది' అనేసి సైకిల్ ఎక్కిపోవాలనుకున్న అతడు తక్కున ఆగిపోయి, 'ఏమండీ?...ఎందుకలా అన్నారు?' అని అడిగాడు ఆశ్చర్యంతో...

'ఆఁ ... ఏంలేదులెండి ... ఏంలేదు...' పైకి పెద్ద ఆతురత కనబరచకుండా అన్నాడు విద్యార్థి.

'మీకాయన తెలుసా?' మళ్ళీ కుతూహలంగా అడిగాడా యువకుడు.

'ఆఁ ... ఏదో తెలుసులెండి .. నాకు డైరెక్టుగా తెలియకపోయినా, అతన్ని బాగా ఎరిగున్నవాళ్ళు నాకు బాగా తెలుసు...' అని, 'ఇంతకూ పెళ్ళి నిశ్చయమై










వెళ్ళినా?' అని అడిగాడు పెద్దగా విస్తుపోతూ...

'సంబంధం స్థిరపర్చుకున్నట్లే.. యిక ముహూర్తాలు పెట్టుకోవాలి. అయినా ఏమిటలా అన్నారు?' విద్యార్థి నాస్పకొద్దీ అతడికి ఆత్రుత ఎక్కువయింది.

'ఆఁ... ఏంలేదండీ ... నూరుకల్లలాడి ఒకయిల్లు నిలపమంటారు, మనవాళ్ళు .. పోన్లెండి...' ఆకుకు అందకుండా పోకకు పొందకుండా అనేసి వూరుకున్నాడు విద్యార్థి.

'నూరుకల్లలాడి ఒక యిల్లు నిలవమన్నారేమో కాని ... నూరుకల్లలాడి ఒక పెళ్ళి చెయ్యడం మాత్రం ఘోరం .. ఒక ఆడపిల్ల నిండుజీవితాన్ని నాశనం చేసి పెట్టు...' అన్నాడతడు.

'అమాట నిజమే కావచ్చు... కానీ... చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏం లాభం? ... సంబంధం స్థిరపర్చుకున్నారు కదా?'

'ఇంకా చేతులు కాలలేదు ... ముహూర్తాలు పెట్టుకోలేదు...అందుకే యింతగా తరచి, తరచి అడుగుతున్నాను మిమ్మల్ని?'

'కానీ నేను చెప్పేది మీరు నమ్మాలిగా?'

'ఆధారాలు చూపితే నమ్మకుండా ఎందుకుంటారు? ... మీకేమన్నా ఆయన్ను



# విద్యార్థి

గురించి తెలిస్తే చెప్పండి...మా నాన్నగారికూడా ఎందుకో మొదట్నుంచీ ఆ సంబంధం అంటే సందేహంగానే వుంది... అందుకే అతడు తొందరచేస్తున్నా యిన్నాళ్ళూ ముహూర్తం పెట్టించలేదు.'

'కట్నమేమన్నా యిస్తున్నారా?... సారీ యిలా అడిగానని...'

'ఫర్వాలేదండీ ... పబ్లిక్ సీక్రెట్ గదా యీ రోజుల్లో యిది...పదిహేనువేలు కట్నరూపంగా యిస్తున్నారు ... తర్వాత మా చెల్లెలుపేర ఆస్తి కొంత పెడతామన్నారు.'

'అసలితడు మీ కెలా తారసపడ్డాడు? ఈ వూళ్లో అరండల్పేటలో వున్నప్పుడు పరిచయమా?'

'ఈ వూళ్లోనా? ... ఈ వూళ్లో కొన్నాళ్ళు వున్నాడా? అదీ అరండల్‌పేటలోనా? మాతో ఆ మాట చెప్పలేదే?... బెజవాడలో మా అక్కయ్యగారింట పక్క యింటిలో అద్దెకుంటున్నాడట. పదినెల్లాయి ...ఏదో బిజినెస్ అదీ అంటున్నాడనీ...మా బావగారు...అంటేను...'

'ఒక్క అరండల్‌పేటే కాదు ... బ్రాడీపేటలో కూడా వుండి...ఓ రోజు రాత్రికి రాత్రి ఖుంటికి అద్దెకూడా యివ్వకుండా మాయమయ్యాడు. ఆ యింటాయనే మొన్న మీ యింట్లోంచి వస్తుంటే చూసి పట్టుకుని అద్దె వసూలు చేసుకున్నాడు...నాకూడా ఆయనే మీ యింటి అడ్రసు చెప్పాడు.' అని చెప్పాడు విద్యార్థి.

'ఓ గాడ్!.. మంచి పెద్దమనిషే!... ఇంతకూ మీకూడా ఏమన్నా బాకీ వున్నాడాండీ?...' అని అడిగాడతడు అనుమానం వచ్చి.

'మనుషుల జీవితాలతో చెలగాటమాడుతున్నవాళ్ళకు 'మనీ' ఒక లెక్కా...అయినా నాకలాంటి బాకీలేమీ లేవు లెండి.' అన్నాడు విద్యార్థి.

'మిస్టర్!.. మీ పేరేమిటో నాకు తెలియదు.. మీరు చెప్పదల్చుకున్నదేదో సూటిగా చెప్పండి...మనుషుల జీవితాలేమిటి?...చెలగాటమేమిటి?'

'నా పేరు విద్యార్థి అంటారు లెండి. ఒక అమాయకురాల్ని నమ్మించి, ఆమెను అనుభవించి, తీరా ఆమె తనవాళ్ళందర్నీ వదులుకొని వస్తే, పత్తాలేకుండా పారిపోవడాన్ని జీవితంతో చెలగాటమనక ఏమనంటారో చెప్పండి మిస్టర్.. మీ పేరు నాకూ తెలియదు.'

'నా పేరు వివేకవర్ధన్ ... అందరూ వివేకబాబూ అంటారు...అవునుగాని ఇలా యిలా రోడ్డు మీద మాట్లాడుకోవడం కంటె ఎక్కడైనా వెళ్ళి కూర్చుందాం రండి.' అంటూ ఒక హోటల్లోకి దారితీశాడు... వివేకబాబు కాఫీకి ఆర్డరిచ్చాడు. ఆ హోటల్లో జనం ఎక్కువగాలేరు .. అందువల్ల వాళ్ళిద్దరూ మాట్లాడుకోడానికి వీలుగా వుంది ... విద్యార్థి జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. వివేకబాబూ చాలా జాగ్రత్తగా విన్నాడు.

'ఆమె యిప్పుడు యిక్కడే వున్నారా' అని అడిగాడు అంతా విన్నాక.

'ఇక్కడే వుంది.. చదువుకూడా మానేసి ప్రస్తుతం వుద్యోగంచేస్తూ కాలం గడుపుతోంది. ఇప్పుడు కావాలన్నా తీసుకెళ్ళి చూపించగలను.' అన్నాడు విద్యార్థి.

రెండు మూడు నిముషాలపాటు వివేకబాబు మాట్లాడలేదు.. ఏలా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

'ఇప్పుడు కాదులెండి...మీకూ, ఆమెకూ ఎప్పుడు వీలవుతుందో చెప్పండి. ఆరోజుకు 'మా బాబాయిగారు చూడాలన్నారు రమ్మ'ని నాన్నగారిచేత వుత్తరం వ్రాయిస్తాను. ఆయన రాగానే, మీ యిల్లెక్కడో చెబితే నేను వచ్చి మీతో చెబుతాను. అప్పుడే అన్ని విషయాలూ తేలిపోతాయి. ఏమంటారు?'

'అలాగే వివేకబాబుగారూ.. కానీ ఒక్క విషయం...ఈ విషయం మీరు మరెక్కడా ఎవ్వరితోనూ అననని నాకు 'ప్రామిస్' చెయ్యాలి.'

'విద్యార్థిగారూ! నా చెల్లెలు భవిష్యత్తు కోసం యింత తాపత్రయపడుతున్న వాడిని, యింకో అమ్మాయి భవిష్యత్తును గురించి ఆలోచించకుండా ప్రచారం చేస్తాననుకున్నారా? నావలన ఆమెకు ఎలాంటి హానీ జరగదని హామీ యిస్తున్నాను... సరేనా?' అన్నాడతడు.

(ఇంకా వుంది)

# సింథాల్ ఇచ్చే వాగ్దానం...

సంపూర్ణ లావణ్య పోషణ

నిత్య నూతన సౌరభం

సార్థక దుర్గంధ నివార్య రక్షణ

## ...నిలబెట్టుకో కలిగింది సింథాల్ ఒక్కటే




సింథాల్ ఒక్కటే జి-11 కలిగియున్న సబ్బు.
ఈ అద్భుతమైన క్రిమి సంహారక పదార్థము, శరీర
దుర్గంధమును, చర్మ లోపములను కలిగించు
క్రిములను రూపుమాపుతుంది. ఈ విధంగా సింథాల్
మీ లావణ్యమును నిష్కళంకముగా వుంచి,
మిమ్ము రోజంతా తాజాగా వుంచుతుంది.

Interpub/GSC/5/72R-Tel



# ఫారిన్ రిటర్న్‌డు లేక స్వదేశీ ఉద్యోగ పర్వాలకు అతీతులు

లేళ్లపల్లి వెంకటలక్ష్మినారాయణ



## నాలుగో కథ
## స్కాలర్లు-డాలర్లు

పద్మనాభం ఆ డిపార్ట్‌మెంట్‌లో చేరి ఆర్నెల్లయ్యింది. ఆ డిపార్ట్‌మెంట్‌లోని ఫారిన్ రిటర్న్‌డ్ స్టాఫ్ మెంబర్సుతో తిరుగుతూ 'మనమందరం ఒక అసోసియేషన్ పెడదాం' అంటూ వుండేవాడు. ఇలాంటివాళ్లో నలుగురున్నారా డిపార్ట్‌మెంట్‌లో. పద్మనాభంతో కలిసి అయిదుగురు వీళ్లు. (వీళ్లుగాక మరొకాయనున్నాడు. ఈయన సిసలైన ఫారిన్ రిటర్న్‌డ్. పైవారం కథలో వస్తాడు) వీళ్లయిదుగురూ కలిసి మాట్లాట్టం చూట్టానికి బావుంటుంది. ఫారిన్‌వెళ్లని వాళ్లని గురించి చెప్పుకోవటంలో వీళ్లందరూ ఒకేమాట మీదుంటారు. ఒకేపాట పాడ్తారు. - కానీ తను వెళ్లొచ్చిన దేశం, తను చదివిన యూనివర్సిటీ చాలా గొప్పదని ప్రతివాడూ అంటాడు. దీంతో భేదాభిప్రాయాలొచ్చి టాపిక్ స్వదేశీ చదువులమీదకు మళ్లించి, డిపార్ట్‌మెంట్‌లోని స్వదేశీ పిహెచ్.డీల గురించి మాట్లాడ్తారు.

ఈ నలుగుర్లో వో సుబ్రహ్మణ్యం వున్నాడు. సుబ్రహ్మణ్యం అదేదో దేశానికి— ఇంగ్లీషు మాతృభాష కాని దేశానికి— మూణ్ణెల్లువెళ్లి వచ్చాడు. ఈ మూణ్ణెల్లల్లోనూ ముప్ఫయ్ సంవత్సరాల చదువు చదివానంటాడు. ఇలాంటి 'షార్ట్ అస్సైన్‌మెంట్లు' కొన్నిదేశాలు యిస్తున్నాయ్. వాళ్లిచ్చే అవకాశం మూడునెలల్నుంచీ తొమ్మిది లేదా పన్నెండు నెలల్దాకా వుంటుంది. ఇలాంటి దేశంనుంచి మూణ్ణెల్లు వచ్చి చూసి వెళ్ళుకొమ్మని సుబ్రహ్మణ్యానికో వుత్తరం వచ్చింది. ఉత్తరం యింగ్లీషులో గాకుండా ఆ దేశపు భాషలో వుంది. సుబ్రహ్మణ్యానికా భాష రాదు. ఆ వుత్తరం పుచ్చుకుని ఆ ఇన్‌స్టిట్యూట్‌లోని ఫారిన్ లాంగ్వేజెస్ సెక్షను కెళ్లాడు— 'బాబూ! ఈ వుత్తరం కాస్త చదివి పెడతారూ!' అంటూ.

(వెంకటాపురంలో వుండే నారయ్య కూడా వెంకన్నపంతులుగారితో సరిగా ఈమాటే అంటాడు. కాకపోతే నారయ్య తెలుగులో రాసిన వుత్తరం తీసుకెడతాడు; సుబ్రహ్మణ్యం మరోదేశపు భాషలో రాసిన వుత్తరం తీసుకువెళ్లాడు. అంతే తేడా... సుబ్రహ్మణ్యం ఆదేశం వెళ్లాక ఆ దేశంలో నారయ్య మాదిరే వుంటాడు...తేడా యేం లేదు.)

అవతలాయన వుత్తరం చదివి క్రింద బెడితే సుబ్రహ్మణ్యం మళ్లీ చదివి పెట్టమన్నాడు. మళ్లీ చదివాక క్రిందపెట్టమన్నాడు. ఈసారి యింగ్లీషులోకి చేసిన తర్జుమాని కాగితంమీద రాసుకుని 'ఫారిన్ ఛాన్సొచ్చింది' అంటూ యెగిరిపోయాడు. ఎగుర్తూనే డిపార్ట్‌మెంటుకు వెళ్లాడు. వచ్చేటప్పుడు యింత సంతోషంగా రాలేదు. ఉత్తరంలో రమ్మనమని రాశారో, వద్దని రాశారో తెలియలేదు సుబ్రహ్మణ్యానికి. ఇలాంటి సుబ్రహ్మణ్యం ఆ దేశంలో ట్రయినింగ్‌కు వెళ్లాడు.

ఆ దేశంవెళ్లి మూణ్ణెల్లల్లో ఆ భాష లోని కొన్ని మాటలూ, రెండుమూడు వూత వాక్యాలూ నేర్చుకునే వేళ్టికి—

'అబ్బాయా! మూణ్ణెల్లూ అయి పోయింది ... ఇహ నిండియాకు వెళ్ళు' అన్నారు.

సుబ్రహ్మణ్యం నవ్వుతూ నిలబడ్డాడు. వాళ్ళు చెప్పింది అర్థంకాలేదు సుబ్రహ్మణ్యానికి. ఇతగాడితో యిట్లా లాభంలేదని వాళ్ళు ప్లేన్ టికెట్టుకొని తీసుకొచ్చి సుబ్రహ్మణ్యాని కిచ్చారు. అప్పటి కర్థమయ్యింది వాళ్లేం చెప్పారో సుబ్రహ్మణ్యా

నిక్. అతగాడు తన సబ్జెక్టుమీద చేసింది గానీ, చూసిందిగానీ యేంలేదు; విన్నదసలే లేదు. అయినా ఫారిన్ వెళ్లానంటాడు. నిదర్శనంగా వక టేప్‌రికార్డర్, వక కెమేరా పుచ్చుకొచ్చాడు.

ఇండియాలో వక వ్యక్తి పట్టభద్రుడైనప్పుడు పొట్లాంలాంటి కాగితాన్ని పట్టుకుని ఫోటో తీయించుకుంటాడు. అది ఆచారం. అతగాడికి 'పట్టా' వచ్చిందని నిరూపించుకునేందుకా ఫోటో యింట్లో కట్టుకుంటాడు; పేరు చివర్న డిగ్రీ పెట్టుకుంటాడు. ఇవన్నీ తనకు డిగ్రీ వచ్చిందని తెలియజేసేందుకు సాక్ష్యాలు. కానీ ఫారిన్‌నుంచి వచ్చినవాళ్లు తాము ఫారిన్ వెళ్లినట్టు తెలియజేసేందుకు కెమెరాలు, ఎలక్ట్రిక్ గాడ్జెట్లు, టేప్ రికార్డర్లు — యిలాంటి సామాన్లన్నీ తెసుకొస్తారు. విదేశీ డబ్బు బాగా వున్నవాళ్లు యింకా పెద్ద వస్తువులెత్తేస్తారు. ఎంత విలువైన సామాన్లు తెస్తే అంత 'పెద్ద' ఫారిన్ రిటర్న్డ్‌గా చలామణీ అవుతాడు. అందుకని ప్రతివాళ్లూ యీ తాపత్రయంలోనే వుంటారు. స్థూలంగా చెప్పాలంటే ఫారిన్ రిటర్న్డ్ విలువ అతగాడు తెచ్చే డాలర్ల మీద లేదా డాలర్లకు సమానమైన వస్తువుల మీద ఆధారపడి వుంటుంది. (విదేశీ కరెన్సీకి మారుపేరుగా 'డాలర్' ను వుపయోగించాను. మొన్నిమధ్య దాకా వివిధదేశాల కరెన్సీలలో డాలర్ 'గట్టి'దన్న నమ్మకం అందరికీ వుంది. ఇప్పటికీ ఆ నమ్మకం—కొంచెం ఆ మధ్య సడలినా—వుంది—రచయిత.)

## ఫారిన్...

'క్రిందటి తడవ వెళ్లినప్పుడు కొన్ని కొనలేదు. ఈసారి వెళ్లినప్పుడు తీసుకు రావాలి' అంటార్తప్ప 'ఈసారి వెళ్లినప్పుడు ఫలానా విదేశీ ప్రొఫెసర్దగ్గిర నేర్చుకుంటాననీ, ఫలానా యూనివర్సిటీలో చేర్తాననీ' అనేవాళ్ళు చాలా తక్కువ.

మూర్తిల్లో యిండియా బయటున్న సుబ్రహ్మణ్యం కూడా తిరిగొచ్చిందగ్గర్నుంచీ విసుక్కోటం మొదలెట్టాడు— 'ఫారిన్ వెళ్లొచ్చి నెలయింది; యింతవరకూ ప్రమోషన్సంగతి మాట్లాడరు. తిరిగి రాకుండా వుండాల్సింది; పొరపాటయిపోయింది' అంటూ.

తిరిగొచ్చిన రెండు నెలల కతగాడికి ప్రమోషనిచ్చారు. నెలరోజులాలిశ్యం అయినందుకు నానా రభసా చేశాడు; ప్రొఫెసర్ లాలించినా గోల పెడుతూనే వున్నాడు. 'నాలాంటివాడు దేశం మొత్తం గాలించినా మీకు దొరకడ'ని భయపెట్టాడు.

ఈ అయిదుగుర్లో మరొకాయనున్నాడు. ఆయన ఫారిన్‌లో యేంజేశాడో దేవుడికీ, ఇన్‌స్టిట్యూట్‌లోని పెద్దాయనకూ తెల్సునని అందరూ అభాండాలు వేశారు. కానీ ఆయన చాలా కష్టమైన పనులు సాధించాడు. ఫారిన్ వెళ్ళకపోతే అవి సాధించగలిగేవాణ్నిగానని యిప్పటికీ తనలో తాను చెప్పుకుంటాడు. బయటకు చెప్పుకోవటం ఆయనకిష్టం లేదు. ఇంతకూ ఆయన సాధించినది యిది: ఫారిన్ వెళ్లి తన భార్యనో రచయిత్రిని చేశాడు. ఫారిన్‌నుంచి బోల్డు వుత్తరాలు, కొన్ని వ్యాసాలు యిండియాలోని వార, మాస పత్రికలకు పంపిందావిడ. ఈవిడ ఆ దేశం వెళ్లంగానే 'మా శ్రీవారి ఫలానాదేశపు ప్రయాణం' అని వక వ్యాసం, తర్వాత 'తదుపరి నా ప్రయాణం' అని మరో వ్యాసం రాసి పంపింది. 'భారతదేశానికీ యిక్కడకూ ఆచారవ్యవహారాల్లో యెంతో తేడా' అంటూ మొదలుపెట్టి 'కానీ అలవాటుపడట మేమంత కష్టం గాదు' అని ముగించేది. ఆయన యీ ఇన్‌స్టిట్యూట్‌లో చేరి యిక్కడొక మేగజైన్ స్థాపింపజేసి దానికి వాళ్ళావిణ్ణి ఎడిటర్‌చేసి తనూ వో కథ రాశాడు. ఈ తతంగంలో చేతిఖర్చు కొంతయ్యిందని కూడా అంటారు.

ఈ గ్రూపులో మరొకాయనున్నాడు. పేరు విష్ణుశర్మ. ఈయన ఫారిన్ వెళ్లి తిరిగొచ్చిం దగ్గర్నుంచి డిపార్ట్‌మెంట్‌లో కూర్చుని కులాంతర, దేశాంతర వివాహాల గురించి వాటి ఆవశ్యకతను గురించి మాట్లాడుతున్నాడు. సబ్జక్టు గురించి దాంట్లో రిసర్చి గురించి నోరు మెదపడు. పైన చెప్పిన వివాహాల గురించి మాట్లాడటం వెనకాలో కథుంది.

పూర్వం రాజులు తమ కుమారులకు రాజ్యం అప్పగించే ముందు దేశాటన చేసి లోకజ్ఞానం సంపాదించుకురమ్మని వారిని దేశం బయటకు పంపేవారు. వాళ్ళలా తిరిగి తిరిగొచ్చేముందు వక్కొక్కరూ వో యిద్దరు ముగ్గురు రాజకుమార్తెలను పెళ్లి జేసుకొచ్చేవారు. ఆ సంప్రదాయాన్ననుసరించే యీ రోజుల్లో ఫారిన్ వెళ్లేవాళ్లల్లో

హారిరామ్









కొంతమంది వెళ్లిన దేశంలోని పిల్లల్ని పెళ్లి జేసుకొంటున్నారు. విష్ణుశర్మ చేసిం దిలాంటి పనేగానీ యీ పని కాదు. అతగా డక్కడికెళ్లి అక్కడ కొచ్చిన మరో భారతీయ యువతిని పెళ్లాడాడు. 'ఇదేం పని... చెడిన వ్రతమేదో యెట్లాగో చెడింది... హాయిగా అమెరికన్ పిల్లని పెళ్లిచేసుకో' మని స్నేహితులు సలహా యిచ్చారు. సలహాలు వినేవేళ్టికే విష్ణుశర్మ చాలా దూరం వెళ్లాడు, అందుకని 'లాభంలేదు' అన్నాడు. అందు కనతగాడికి 'స్వామి' అని పేరు పెట్టా రతగాడి స్నేహితులు. ఆర్కే నారాయణ్ రాసిన 'స్వామి అండ్ ఫ్రెండ్స్'లో పరీక్షలయ్యాక స్నేహితులందరూ ఒకరిమీదొకరు సిరాలు చల్లుకుంటుంటే స్వామి తన సిరా బుడ్డెత్తి తనమీదే సిరా పోసుకుంటాడు. ప్రక్కవాళ్లమాదిరి చెయ్యాలని వుబలాటం; చేసేందుకు ధైర్యంలేక 'సూక్ష్మంలో మోక్షం' అన్నట్టు యిలాంటిని చేసి తృప్తిపడటం దీనికి కారణం కావచ్చు. దీన్ని మనస్తత్వ శాస్త్రజ్ఞు లేమంటారో తెలియదుగానీ యిదే 'స్వామి'కీ 'విష్ణుశర్మ'కూ గల పోలిక అన్నారు విష్ణుశర్మ స్నేహితులు ... విష్ణుశర్మ యీ పన్చెయ్యటంతో అతగాడికేం లాభం కలిగిందో గాని యిండియాలో వున్న అతగాడి వాళ్లకు మాత్రం లాభించింది. వాళ్ల చుట్టాల్లోనూ స్నేహితుల్లోనూ, యిలా చెప్పే వాళ్లు.

'మా విష్ణుశర్మ అమెరికాలో పెళ్లి జేసుకున్నా మనవాళ్లమ్మాయినే వివాహం చేసుకున్నాడు; వాళ్లదీ మనశాఖే. అమెరికా వెళ్లి పెళ్లి మేమే చేయించాం. పెళ్లి అమెరికాలో జరిగినా బీజం మంచిది కాబట్టి వంశమర్యాదలు మంటగలవలేదు' అని.

స్నేహితుల్లోనూ, చుట్టాల్లోనూ యిలా చెప్పేముందు ఆ అమ్మాయిని వొదిలెయ్యమని విష్ణుశర్మకు హితబోధ చేశారు. కాని విష్ణుశర్మ వినలేదు. అందుకతగాణ్ణి అభినందించాల్సిందే ... ఫారిన్‌నుంచి తిరిగొచ్చాక విష్ణుశర్మ యింతవరకూ యిలాంటి వివాహాల ఆవశ్యకత గురించి చెబుతున్నాడు.

ఈ అయిదుగుర్లో మరొకాయనున్నాడు; పేరు ప్రేమ్‌చంద్. ఉత్తర హిందూస్థానంలోని యూనివర్సిటీలో ఎం. ఏ.

డిగ్రీ తీసుకుని తర్వాత్లో తొమ్మిది నెలలో అమెరికాలో వుండి ఒక డిగ్రీలాంటిది తీసుకొచ్చాడు. ఇప్పుడతగాడు తనపేరు వెనక వున్న యిండియన్ డిగ్రీని తుడిచేసి తొమ్మిదినెలల అమెరికన్ డిగ్రీనే తగిలించుకున్నాడు. ఆ డిగ్రీప్రక్కన బ్రాకెట్లులో యూనివర్సిటీ పేరుకూడా రాస్తాడు. ఈ తొమ్మిదినెలల డిగ్రీ గురించి రోజుకో తొంభై తడవల్జెప్తాడు. ఇండియన్ పిహెచ్. డి. కంటె కూడా యీ తొమ్మిది నెలల డిగ్రీ యెన్నోరెట్లు యెక్కువంటాడు. ఈ తొమ్మిదినెలల డిగ్రీకి తొమ్మిది యింక్రిమెంట్లు, మూడు ప్రమోషన్లు రాలేదని చాలా బాధపడతాడు. ఈబాధల్చెప్తూ చుట్టుపక్కల వాళ్లని బాధపెడతాడు. రోజులో యెక్కువభాగం వచ్చిన ఫారిన్ డిగ్రీ గురించి రాని ప్రమోషన్ల గురించి మాట్లాడ్తాడు. అప్పుడు చాలా



# ఫారిన్...

ఎమోషనల్‌గా వుంటాడు. ఇతగాడు ఆ డిపార్ట్‌మెంటు నుంచొచ్చే ఒక మేగజైన్‌లాంటి జర్నల్‌కు పేపర్లంటూ రెండు పుస్తకాల్లోంచి యెత్తి రాస్తూ వుంటాడు. వాటిని పేపర్లని అందరూ నెత్తిమీద పెట్టుకోవాలంటాడు. మిగతావాళ్లు రాసేది చెత్తంటాడు పైగా. ఆ మేగజైన్‌కు పేపర్ రాసిచ్చేటప్పు డతగాడ్చేసే హంగామా చూడాలి. తనిచ్చే ఆ 'పేపర్' అమెరికన్ యూనివర్సిటీలో కూర్చుని రాశానంటాడు, అమెరికాలో కొన్న పేపరుమీద రాశానంటాడు. ఈ రెండు విషయాలవల్ల ఆ పేపరు గొప్పదంటాడు. ఆ మేగజైన్లో పడ్డవాటి 'రీప్రింట్'తీసి డిపార్ట్‌మెంట్‌లో అందరకూ యిస్తాడు. ఫారిన్‌వెళ్లి రానివాళ్లకిచ్చి 'చదువుకుని బాగుపడండి' అంటాడు. ఫారిన్ వెళ్లొచ్చిన వాళ్లకిచ్చి 'చదివి మీ సలహా యివ్వండి' అంటాడు. ఫారిన్ రిటర్న్డ్ వ్యక్తులు సలహా లివ్వరు. వాళ్ళలో వో సుగుణం వుంది. ఏ కాస్త పని వాళ్ళు చేసినా మరొకళ్ళు చెయ్యగా చూసినా బోల్డు సంబరపడిపోతారు. చేసింది అవతలివాడైతే వాడి చెయ్యి పుచ్చుకుని వూహూ మెచ్చుకుంటారు. ఈ సుగుణం అమెరికా వెళ్లి తిరిగొచ్చినవాళ్ళల్లో మరీ కనిపిస్తుంది.

ప్రేమ్‌చంద్ యిలాంటివాళ్లకి రీప్రింటిస్తూ—'ఇది రెండు రోజుల్లో రాశాను. యూనివర్సిటీ ప్రక్కనున్న నది గట్టునున్న చెట్టు కింద కూర్చుని రాశాను... సరిగ్గా వకటిన్నర రోజులు పట్టింది' అంటాడు.

'వండర్‌ఫుల్...జస్ట్ టు డేస్!!...ఇన్‌క్రెడిబుల్' అంటారు తోటివాళ్ళు.

ఈ లోపల మరో ఫారిన్ రిటర్న్డ్ తనకు ఫారిన్‌లోని చాలా యూనివర్సిటీలతో పరిచయం వుందని నిరూపించుకునేందుకు—'మీరు కూర్చున్న నది మీద ఒక బ్రిడ్జి మొదలెట్టారు. 1970 లో అక్కడున్నాన్నేను. అప్పుడ్చూశాను. అది పూర్తయ్యిందా?' అన్నాడు.

ఇతగాడు తన పేపర్సంగతి చెప్పనీకుండా అడ్డొస్తున్నాడని ప్రేమ్‌చంద్‌కు కోపమొచ్చింది. అయినా అడ్డొచ్చినవాడు అయినవాడూ, తోటివాడూ, ఒకే గూటి పక్షి అని గుర్తొచ్చి కొంచెం నెమ్మదిగానే —

'ఆ... పూర్తయ్యింది. సరిగా నేను పేపర్ పూర్తిజేసి నరోజునే ఆ బ్రిడ్జికూడా పూర్తయ్యింది. పేపర్ పూర్తిచేసి నేనూ ఆ బ్రిడ్జి మీద నడిచాను ... చాలా పెద్ద బ్రిడ్జి... బ్రిడ్జి మీద నడుస్తూ రాసిన పేపర్చదువుకున్నాను ... బ్రిడ్జి ఆ చివరకు వెళ్లేసరికి పేపర్చదవటం పూర్తయ్యింది' అన్నాడు ప్రేమ్‌చంద్.

'మార్వెలస్' అంటూ కళ్లు తేలేసి మెడలు వేలాడేశారు మిత్రులు.

'కానీ ఆ నదివద్దున వింటర్లో చాలా చాలా చలిగా వుంటుందండి ... అయినా అక్కడ కూర్చోందే నాకు తోచేది కాదు. అందుకే స్పెషల్‌గా కోట్లు, గ్లౌవ్స్ కొనుక్కుని వెళ్లి కూర్చునేవాణ్ని ... ఆ కొన్నవిప్పుడు యిండియాకు తెచ్చుకున్నాను' అన్నాడింకొకాయన.

వీళ్లీమాటలనుకుంటూ వుండగా యిద్దరటువైపుగా వెళ్లారు. అందులో ఒకాయన మరొకాయన్నుద్దేశించి—

'ఇదండీ వీళ్లతంతు...వాళ్లు కొనుక్కొచ్చిన వాటిగురించి చెప్పేందుకో అంతుండద్దండీ?' అన్నాడు.

అవతలాయన నవ్వాడు. నవ్వి—

'ఏమైతేనేం లెండి... ఇప్పుడు వాళ్లకు గిరాకీ. అధికారులు మన విషయాల్లో పరాకు చూపిస్తారుగానీ వాళ్ల విషయంలో కాదే...ఎందుచేత నంటారు?' అన్నాడు.

'ఏమన్నారు? మళ్లీ అడగండి చెప్పుతాను' అన్నాడు మొదటాయన.

'ఏమైతేనేంలెండి ... ఇప్పుడు వాళ్లకు గిరాకీ. అధికారులు మన విషయాల్లో పరాకు చూపిస్తారుగానీ వాళ్ల విషయంలో కాదే... ఎందుచేతనంటారు?' అన్నాడు అవతలాయన మళ్లీ.

'అక్కడాగండి చెపుతాను' అన్నాడు మొదటాయన.

మొదటాయనపేరు మోహన్రావు: ప్రశ్న మళ్ళీ మళ్ళీ అడిగించుకునిగానీ సమాధానం చెప్పడు. అట్లా చెప్పకపోతే అడిగినవాడికీ, అడగనివాడికీ చెపుతాడనే అప్రతిష్ఠ వస్తుందని భయం. అందుకని మళ్ళీ మళ్ళీ అడుగుతాడన్నారు కొందరు. అదేం రాదు; అతగాడు యేక సంథాగ్రాహి కాడు. అదీ అతగాడితో వచ్చిన చిక్కు అన్నారు మరి కొందరు. ఇదిప్పుడొచ్చిన జబ్బు కాదు; అతగాడు చిన్నప్పట్నుంచీ అంతే, నన్నారు. ఏమైనా మోహన్రావు ప్రశ్న మళ్ళీ మళ్ళీ అడిగించుకోటానికి మొహమాట పడడు.

మోహన్రావు మొదలెట్టాడు :

'పూర్వం విదేశాలు వెళ్ళి స్కాలర్‌షిప్పు సంపాదించుకుని స్కాలర్సుగా తిరిగిరండి' అని విదేశాలు పంపేవాళ్ళు కుర్రాళ్ళని. అందుకనా రోజుల్లో విదేశాల్నుంచి స్కాలర్సు తిరిగొచ్చేవాళ్ళు. అందుకని వాళ్ళకెంతో గౌరవం. వాళ్ళ అడుగులకు మడుగులొత్తే వాళ్ళు. వాళ్ళేదడిగితే అదిచ్చేవాళ్ళు. వాళ్ళ నడుగున పెట్టకుండా పదిమందీ కలిసి నో వందమంది పైకెత్తేవారు. ఫారిన్ రిటర్న్డ్‌కీ గౌరవం అప్పట్నుంచి వస్తోంది. ఈ మధ్యకాలంలో ఆ గౌరవం పోయి మరో గౌరవం వచ్చింది. దేశానికి విదేశీ ద్రవ్యంయొక్క అవశ్యకత యెంతైనా వుంది. విదేశాలకు వెళ్ళి యిండియాకు విదేశీ మారకద్రవ్యం పంపేవాళ్ళంటే అంద రకూ ఆపేక్ష. అందువల్ల వాళ్ళంటే గౌరవం. వీళ్ళు ఫారిన్ వెళ్ళి రావటంవల్ల స్కాలర్సు, డాలర్సు—రెండూ యిండియాకు దొరకొచ్చు; లేదా కనీసం డాలర్సన్నా దొరక్కపోవు...కానీ తిప్ప లెక్కడ మొద లయ్యినయ్యంటే—స్కాలర్సక్కడ పౌరసత్వం తీసుకుని వుండిపోతున్నారు. మనం డాలర్సని లెక్కించేవాళ్ళని మాత్రం దక్కించుకుంటు న్నాం' అని ఆపాడు మోహన్రావు.

(ఇంకా వుంది)





# "నేనూ-నా పాత్రలూ"- జయంతి

కళారాధన చేసే నటుడుగాని, నటిగాని తను ధరించే పాత్రలను గురించి చర్చించేటప్పుడు భలానాపాత్ర నాకిష్టం, భలానావేషం సరిగ్గాలేదు అని చెప్పటానికి ఆస్కారమేలేదు. నా దృష్టిలో, నటించే ప్రతిపాత్ర అమోఘమనే కళాకారిణి భావించాలి. పెద్దలు చెబ్తారు. 'పాత్రలో జీవించటం గొప్పవిషయం, పాత్రలో నటించడానికష్ట' అని. నేను ఇంతవరకు షుమారు డెబ్బయి చిత్రాల్లో జీవించాను. ఈ 70 చిత్రాల్లోని పాత్రల్ని ఒక్కసారి సింహావలోకనం చేసుకుంటే నాకే ఆశ్చర్యం కల్గుతుంది. కాని నా చిత్ర నటనా జీవితంలో ఎక్కువ చిత్రాలు కన్నడ, తమిళ భాషల్లో నటించటం జరిగింది. తెలుగు చిత్రాలను గురించి చెప్పదలుచుకుంటే కేవలం వేళ్లమీదనే లెఖపెట్టవలసి వస్తుంది. 'ఆనాడు తీసిన 'భార్యా భర్తలు' 'జగదేకవీరుని కథ' చిత్రాల్లో నేను చిన్నపాత్రలు ధరించినా అవి పెద్ద హీరోల ప్రక్కన ప్రియురాలినిగా నటించటం నా అదృష్టం. కాని ఫిలిం పరిశ్రమలో చిన్నవేషాలు వేయటం ప్రారంభిస్తే నాయకి పాత్ర వెయ్యడానికి చాలా సంవత్సరాలు పడుతుంది. ఒక్కొక్కప్పుడు, ప్రతిభవున్నా అవకాశాలు రావటం అతికష్టం. అది పరిశ్రమలోని వాతావరణాన్ని అర్థం జేసుకున్న వాళ్లందరికీ తెలిసిన విషయమే. 'స్వర్ణమంజరి'లో శ్రీమతి అంజలీదేవిగారు నాకు చాలా ముఖ్యమైన పాత్రనే ఇచ్చారు. కాని నా దురదృష్టం. ఆ చిత్రం తర్వాతకూడా నాకు తెలుగు మార్కెట్ రాలేదు. 'చుట్టరికాలు' చిత్రంలో నేను యౌవనావస్థనుండి వృద్ధాప్యందాకా కథా వస్తువున్న చక్కటిపాత్ర ధరించాను. ప్రజలు, పత్రికలూ ఎంతో ప్రశంసించినప్పటికీ, తెలుగు పరిశ్రమనుండి ఆదరణ లభించలేదు. జెమినీ సంస్థ, దర్శకులు శ్రీ బాలన్‌గారు నామీద చూపిన అభిమాన ఫలంగా 'కలెక్టర్ జానకి'లో మంచిపాత్ర లభించింది. ఇదేవేషం నేను అరవం 'ఇరు కోడుగళ్'లో కూడా వేసి మంచిపేరు తెచ్చుకున్నాను. తెలుగు చిత్ర జగత్‌లో నాజీవితానికొక నూతనాధ్యాయం సృష్టించింది 'కలెక్టర్ జానకి' చిత్రం. ఎన్నివేల ప్రశంసా లేఖలో చెప్పలేను. తెలుగు ఫిలిం జర్నలిస్టులంతా, నన్ను ఎంతగా అభినందించారో—తలుచుకుంటే శరీరం జలదరిస్తుంది. కన్నడంలో ఎంతో ఉన్నతమైన స్థాయికి వెళ్లి, తమిళంలో మంచిపాత్ర లెన్నోధరించి పేరు తెచ్చుకుని, తెలుగు అడబడుచునైన నేను, మానసికంగా బాధపడే సమయంలో, ఆంధ్ర ప్రజానీకం, తెలుగుచిత్ర నిర్మాతలు, తెలుగు పత్రికేయులు, చల్లని చూపుతో, ఆదరాభిమానాలతో నన్ను చేరదీసి దీవించారు. అదృష్ట వంతురాలిని, ఇవాళ శ్రీ రామారావుగారి 'కుల గౌరవం'లో నాయికగా నటిస్తూ వున్నా, శ్రీ నాగేశ్వరరావు గారితో 'బంగారు బాబు'లో సోదరిగా నటిస్తూ వున్నా, మా బెంగాలీబాబుతో (శ్రీ శోభన్‌బాబుని నేనల్లా పిలుస్తాను) మూడుచిత్రాల్లో హీరోయిన్‌గా నటిస్తూ వున్నా, యిదంతా జెమినీ 'కలక్టర్ జానకి' ప్రభావమేనని నానమ్మకం. అన్నగారు శ్రీ రామారావుగారి 'కులగౌరవం', రొమాంటిక్ ఎవర్ గ్రీన్‌హీరో నాగేశ్వర రావుగారి 'బంగారుబాబు' చిత్రాలు విడుదలైం తర్వాత, మా బెంగాలీబాబుతో కాంబినేషన్ 'జీవితం' చూసిన తర్వాత, తెలుగు చిత్రరంగంలో నాకొక సుస్థిరమైన స్థానం ఏర్పడుతుందనే విశ్వాసంతో వున్నాను.

పాత్రలను గురించి చర్చించేటప్పుడు నేను ధరించేవి, విభన్న మనస్తత్వాలు గల పాత్రలు. 'కులగౌరవం'లో మొదటిభాగంలో గ్లామర్ నృత్యతార, ఆ తర్వాత గృహిణి, తర్వాత తల్లి, అనంతరం అభాగినియై కృంగి కృశించి చివరకు భర్తను, కొడుకునూ చేరుకుంటుంది. ఈ పాత్రకు కన్నడంలో నాకు ఉత్తమనటిగా అవార్డు లభించింది.



జయంతి

తమిళం, హిందీలలో కూడా నేనే నటిస్తున్నాను. 'బంగారుబాబు'లో అంధురాలైన, వయస్సులో వున్న అందాల చిన్నారి చెల్లెలు పాత్ర నాది. అన్నయ్య ప్రేమ, ఆదరణే జీవితానికి ఆధారాలుగా బ్రతుకుతూ, చివరికి సుఖాంత మయ్యేపాత్ర ఇది. ఇదే తరహా పాత్రను 'తుమ్‌సే అచ్ఛాకౌన్‌హై' అనే హిందీచిత్రంలో షమ్మీకపూర్ ప్రక్క నటించి బొంబాయి పరిశ్రమలో ఎంతో మంచిపేరు తెచ్చుకున్నాను. శ్రీ నాగేశ్వర రావుగారి ప్రక్క నాయికిగా నటించాలనే జీవితాశయం గలనేను, చెల్లెలిగా నటించడానికి అంగీకరించడానికి కారణం మా రాజేంద్ర ప్రసాద్‌గారు, పైగా యీ విధంగా హీరోని అడపాదడపా కలుసుకో వచ్చు. వేషంకోసం దెబ్బలాడవచ్చు అనుకుంటున్నా. ఆశయం నెరవేరటం ఎట్లా వున్నా, పెద్దకంపెనీలో, పెద్దతారలతో పాటు నటించటం సర్దాగానే వుంది.

మార్గో సబ్బు ఒక్కటే ఒక్క శుభ్రపరచడానికేగాక ఎంతో వుపకరిస్తుంది. చలికాలంలో గాని ఎండాకాలంలో గాని చర్మాన్ని రక్షిస్తుంది

# ఎందుకంటే మార్గోలోనే వేపనూనె వుంటుంది






మార్గో సబ్బు నురుగు వెన్నలా వుంటుంది. సహజమైన వేపనూనె సమృద్ధిగా వుంటుంది. లావణ్యంతో చర్మాన్ని పోషించడానికి కావలసిన జిడ్డు పదార్థము. వేపయొక్క పూతినాశక గుణములు అంటురోగములను రానియదు. మార్గో చర్మాన్ని మృదువు పరచి మచ్చలను పోగొడుతుంది. అంతేగాక మార్గోలోనున్న దుర్గంధాన్ని పోగొట్టే వేపనూనె గంటలకొద్దీ తాజాగా నవనవ లాడింపజేస్తుంది. హానికరంగాని వెన్నవంటి మార్గో సబ్బు మీ కుటుంబమంతటికి ఎంతో వుత్తమమైనది!

## మార్గో సబ్బు

మీ చర్మాన్ని
మృదువుగాను,
సున్నితముగాను వుంచును

కలకత్తా కెమికల్స్‌వారి తయారీ

CCM/4183

## 'నేనూ-నా పాత్రలూ'

ఇహ ఇప్పుడున్న తెలుగు, తమిళ, కన్నడ చిత్రాలన్నింటిలోనూ కూడా మంచి పాత్రలు, ఎంతో విశిష్టమైన పాత్రలు ధరిస్తున్నాను. బయటివాళ్లు అనడమే కాదు, నాకూ తెలుసు నాది కొంచెం స్థూల శరీరమని. తగ్గడానికి చెయ్యాల్సిన వన్నీ చేస్తున్నాను. దొండుంపతెగ, నీరసం వస్తోందికాని, సన్నగా ఎముకలు బయట పడేలా కాలేక పోతున్నాను. అయినా, దవడలు లోపలికిపోయి, కళ్లు గుంటలుపడి, ఎముకలు గుచ్చుకునే గ్లామర్, అదేం గ్లామరో నాకర్థంగాదు. హీరో కౌగిట్లోకి తీసుకుంటే మెత్తగా, నిండుగా, ఫోమ్ రబ్బరు పిల్లోలాగ వుండాలిగాని—సరేలెండి—దంతా ప్రజలకు తెలీదా? చక్కగా, సెక్సీగా వుండి, చక్కని నటనా ప్రతిభను ప్రదర్శించే వాళ్లను ఆదరించటం వాళ్లకు బాగా తెలుసు.

కన్నడ, తమిళ చిత్రాల్లో, నా అదృష్టంవల్ల, 'గ్లామర్ వేషాలు, సెక్సీగా వుండి లైట్‌గా ఆడుతూ పాడుతూ వుండే వేషాలు; బరువుగా, ఘోరున ఏడుస్తూ (ఏడిపిస్తూ) వుండే వేషాలు ఎన్నో ధరించాను. 'బెట్టదహూలి' 'మిస్. లీలావతి' అనే చిత్రాల్లోని స్టిల్స్, వాల్ పోస్టర్సు—కొన్ని వందలకొద్దీ (నావి) స్టూడెంట్స్, తీసుకుపోయిన విషయం బెంగుళూరు పత్రిక లన్నింటిలోనూ వ్రాశారు. అది చదివితే, నే నెట్లాంటి సెక్సు పాత్రలు ధరించిందీ మీకు తెలుస్తుంది. సాఫ్టుగా వుండే గృహిణి పాత్ర లకు మాత్రమే నేనెంతో బాగుంటానని అనుకునేవాళ్లు ఆ కన్నడ చిత్రాలు చూస్తే ఎంతో బాగుండును.

ఏది ఏమైనా, ఏతరహా పాత్రనైనా నేను చేయగలను, మెప్పించగలను అనే ధైర్యం నాకుంది. ఇందులో అహంకారం ఏమాత్రం లేదు—ఆత్మవిశ్వాసం అని సవినయంగా వ్రాసుకుంటున్నాను.

# పండగ మామూలు




దసరా వస్తోందని నేను ఆగస్టులో చెప్పాను. అంటే మీ అందరికీ తెలియదని కాదు. అక్టోబరు మొదట్లో జ్ఞాపకం చేసినా చాలు కొందరు మగ వారికి. కాని మా వారిది మరీ స్లో. అంచేత—ఆగస్టు లోనే చూచాయిగా — 'పండగ లొస్తున్నాయిండీ' అన్నా. పేపరులోంచి తల తీయలేదు. 'అలాగా' అంటూ ఎడిటోరియల్ లోనే వుండి పోయారు. నాకలా పట్టీ పట్టనట్టు సమాధానం చెప్తే మహా ఉడుకుమోత్తనం వచ్చేస్తుంది. అంచేత వో క్షణం కోపం కంట్రోలు చేసుకుని—'యీ రోజు మైల్లో కాదు. అక్టోబరులో' అన్నాను. ఏం లాభం—నా జోకు విని వుంటే—నా స్నేహితులు మూడు రోజులు తల్చుకు తల్చుకు ఆనందించేవాళ్లు. మా ఆయన కనీసం దాన్ని వినిపించుకున్నట్టు కూడా లేదు. మళ్లీ 'అలాగా?' అన్నాను. యీసారి ప్రశ్నార్థకం ధ్వనించడంతో కాస్త వుత్సాహం కల్గింది. నాకు—ఏదో ప్రశ్నించినట్టు తెలిసిందని! ఎర్రగా కాలినప్పుడే కదా యినుం సాగ్గొట్ట కల్గేది? అని 'అవునండీ అక్టోబరులో దసరా పండుగలు' అన్నాను. దీనికింక సమాధానం లేదు. సంపాదకీయం చాలా ప్రశస్తంగా వున్నట్టుంది. వూపిరి వదలకుండా చదివేస్తున్నారు.

నేనూ పక్కనే కూర్చుని పత్రిక చేతపట్టుకున్నాను గాని మనస్సంతా 'అయ్యో వీరికి ఒకవార్త చెప్పి వినేలా చేయలేక పోయానే అని పీకుతోంది. పీకడం ఏమిటి నా ముఖం చచ్చే పంతం పుట్టుకు వస్తోంది. ఏమైనా సరే యీ రోజు వీరికి పండుగలు వస్తున్నాయనీ, దానికి నారేం కొనేదీ తేల్చుకొని చెప్పాలనీ—చెప్పించాలనీ అనుకున్నాను. నాలో ఎప్పుడైతే అలాంటి ధృఢ నిర్ణయం వచ్చిందో—అంతే— నా స్త్రీత్వపు నేర్పరి తనం అంతా తక్షణం మూర్తీభవించినట్టు నాలో కొత్తవెల్గు వచ్చేసింది. నాకాక్షణంలో తిప్పడానికి పది చేతులు ఆలోచించడానికి ఐదు బుర్రలు, మాట్లాడ్డానికి పాతిక నాల్కలు వచ్చాయి! ఈ ఎడిటోరియల్ ఎంత సేపు చదువుతారులే. అది అయిపోగానే పేపరు తీసేసి బాత్ రూములో బోయిలర్ పక్కన పడేస్తాను అనుకుని నిశ్చింతగా నేనూ చేతిలో పత్రిక చదవడం మొదలు పెట్టాను. పత్రికలు అందులోనూ దిన పత్రిక యిక్కడ మరీ ఆరుగంటల లోపునే పడేస్తాడు. ఏం పుట్టి మున్గుతుందనో! ఆ పేపరువాడొచ్చి పడేసేలోగా రైలు కెళ్లవలసినంత అర్జంటుగా స్నానం కూడా ముగించి తల తుడుచుకుంటూనే పేపరొచ్చిందా? పేపరొచ్చిందా? అంటూ అడుగుతూంటే—ఒక్కొక్కప్పుడు నాకు అనుమానం వస్తూంటుంది.—యీ పేపరు కుర్రవాడు కానీ రాయబారాలు మొయ్యడం లేదు కదా అని. ఆఁ ఏ ప్రేయసి కింత వోపిక వుంటుందిలే అని సరిపెట్టుకున్నా—ఏమో—యీ ప్రేమించే వాళ్లకి ఏదీ అసాధ్యం కాదని తోచి—ఎందుకేనా మంచిదని, నాలుగైదు రోజులు వరుసగా వాడు పేపరు పడేయగానే మడతలువిప్పి దులిపి చూశాను. ప్రేమలేఖ లేం లేవు. అంచేత యీయన హడావిడంతా నిజంగా పేపరుకోసం అందులో వార్తల కోసమే అని నమ్మక తప్పలేదు.

ప్రేమలేఖలా....?



మా వారింకా పేపరులోంచి తల తియ్యలేదు. యింకా అప్పుడే నన్నని ఎండ అంతటా ప్రాకుతోంది. పిల్లలెవరూ లేవలేదు. లేచే జాడకూడా లేదు—ఆదివారం కదూ!! నేను మటుకు నాల్గ్గంటలకే లేవాలి—లేకుంటే నీళ్లు పట్టడం అవదు. వారి ఎదుట కుర్చీలో కూలబడి కూర్చునే సరికి... ఎక్కడ లేని నిద్రా నిస్సత్తువా ముంచుకు వచ్చింది. చేతిలో పేపరు చేతిలోనే వుంది. కళ్లుమటుకు నిద్ర కూరిగాయి. మనస్సు మెలుకవగానే వున్నట్టుంది. లేకపోతే యింకా నిద్రలో కూడా దసరా అంటూ ఎందుకు ఆలోచిస్తుంది? దసరా వచ్చేసింది మా యిల్లు చిన్న పాలెస్ అంత వుంది. దాన్లో పక్కనే పెద్దహాలు. ఆ హాల్లో పదిమంది పని వాళ్ళు. బొమ్మల కొలువు,తీర్చి దిద్దుతున్నారు. ముందుహాల్లో ముద్దులొలికే కార్పెట్, దానిమీద అక్కడక్కడ—సోఫాలు, యింటి ముందు లాను. దాన్లో కుర్చీలు వెల్గి ఆరుతూ కన్నుల పండువ చేస్తున్న దీపాలు—అన్నిటికీ మధ్య నేను! మోయలేని నగలు,ఎప్పుడూ ఎరుగని పట్టుచీర కట్టుకుని—పని వాళ్లకి పని చెప్తూ విసుక్కొంటూ అలసి పోతున్నాను! ఇంతట్లో మా వారొచ్చారు—వారు మావారేనా? బాపు రామాయణంలో హనుమంతునిలా పెరిగిన వారితల ఆకాశాన్నంటుతోంది! చుట్టూ చేతులు! చుట్టూ తలలు! ఆ తలల్లో ముఖాలన్నీ చిరునవ్వులు! చేతులన్నిటితో తలోగిఫ్టు! పైకెత్తిన చేతిలో జ్యోతిలక్ష్మి చీరలా మిలమిల మెరసి పోతుందో చీర, నక్షత్రాలూ మెరుపు తీగలూ కలబోసినట్టు మెరుస్తోంది. మిగిలిన చేతులనిండా రకరకాల నగలూ నట్రా. చంకలో (ఏచంక?) వార్తాపత్రిక. అదిచూసే మా వారిని గుర్తు పట్టాను. 'అదేమిటండీ దసరా బుల్లోడికంటె డబ్బొచ్చినట్టుంది.' అన్నాను ఆశ్చర్యంగా. మావారి ముఖాలన్నీ వో సారి గట్టిగా నవ్వాయి. 'అంతే అయింటుంది. జాక్ పాట్ మీద జాక్ పాటు, లాటరీ మీద లాటరీ వచ్చినా మీకెంత పండగ బహుమానం యివ్వాలని తోచదే! ఏం పూనింది?' అన్నాను. మావారు మాట్లాడలేదు. అందుకో అన్నట్టు చూశారు. ఒక్కొక్కటే అందుకొంటున్నాను.. నా కళ్లని నేనే నమ్మలేకుండా వున్నాను— 'మీకురావలసిన బాకీలన్నీ ప్రొడ్యూసర్లిచ్చేశారా? అన్నాను. చీర అందుకుంటూ (మనస్సులో పీకుతూంది. యివ్వవలసిన డబ్బుకి సెట్ ప్రోపర్టీ యిచ్చేసేరేమోనని!) వారింకా మాట్లాడ లేదు. 'అయ్యో అలా ఎలా యిచ్చేసేరండీ, అంతా రాయించుకునేదాకా చుట్టూ తిరిగి ఏ పరంధామయ్య పేరో ఏ రంగాచారి పేరో తగిల్చి డబ్బెగస్తారు కదా? అంతా రాయించుకుని ముఖం చాటేస్తారు కదా? యింత కలికాలం ఎలా పుట్టుకొచ్చిందండీ?' అంటూ పక్కచేయి అందిస్తున్న నెక్లెసు అందుకున్నా.

నా పట్టుచీరకీ—నామాటలకీ పొత్తు కుదరడం లేదని తెలుసు. అయినా మేలొక్కన్న మనసు వ్యంగానే ఆలోచిస్తుంది కదా!

మావారు మటుకు చిదానంద మూర్తిలా అలాగే వున్నారు. కాని అదేమిటో నేను అందుకుంటున్నకొద్దీ వారి దివ్యరూపం తరుక్కుంటూ వస్తూంది !!

చివరికి పత్రిక చుట్టచుట్టి అందించారు. అది అందుకుందుకు చేయి చాచానో లేదో— నాకు తెలివి వచ్చేసింది. అయ్యోరామా! లేవగానే మళ్లీ విదేమిటో,అనుకున్నాను. ఎదురుకుండా మా వారింకా పేపర్లోనే వున్నారు. సంపాదకీయం దాటి వెనుక పజిల్‌లో వున్నారు. నా కలకి నాకే నవ్వువచ్చింది. యింతా చేసి పగటి కల కదా! ఫలితం అంతంత మాత్రమే కదా అని నిట్టూర్చాను.

అప్పుడు పేపరులోంచి తలెత్తారు మావారు. ఏమిటి సంగతి అన్నట్టు తల పంకించారు. 'దసరాకేం కొంటారు?' అన్నాని మాటు మూటిగా. డొంక తిరుగుడూ అవీ యిక వారితో లాభం లేదని.

'ఎప్పుడూ కొంటూనే వుంటావు. యింక విడిగా దసరాకి ఎందుకు?' అన్నారు. వేళ్లు లెక్కపెట్టుకుంటూనే. అది పడవలసిన మాట లెక్కలు.

'ఎప్పుడూ కొంటే పండక్కి వద్దా?' అన్నాను.

'పండక్కి మనకు అలవాటైన దొకటి వుందికా?' అన్నారు—గళ్లలో అక్షరాలు పొదుగుతూ.

'దెబ్బలాటే గా— సరే. మీతో మాట్లాడాలని ప్రయత్నించడం నాదే తప్పు' అంటూ చివాలున లేచి—వంటింట్లోకి వెళ్లి పోయాను. ●

---

**అవీ – ఇవీ . . .**

# కుటుంబనియంత్రణ వ్యతిరేకోద్యమం

కుటుంబనియంత్రణ గురించిన ప్రచారం ముమ్మరంగా సాగుతున్నది. దాని ఆవశ్యకతని అంతా గుర్తించారు. అటువంటి సమయంలో— 'కుటుంబ నియంత్రణ వ్యతిరేకోద్యమం' ప్రవాహానికి ఎదురీదడం లాంటిది.

ఈ సాహసానికి పూనుకున్నవాడు శ్రీ సుధీర్ లక్ష్మణ్ హెంద్రే. మహారాష్ట్రలోని సతారా జన్మస్థలం. బొంబాయిలో వ్యాపారం చేస్తున్నారు. రెండుసార్లు బొంబాయి నుంచి పార్లమెంటుకి పోటీ చేసి ఓడిపోయారు. బాగా సంపన్నుడు.

'నేను ఏ పార్టీకీ చెందను' అన్నారాయన ఈమధ్య మద్రాసు ప్రెస్ కాన్ఫరెన్సులో మాట్లాడుతూ.

సేలంలో జరిగే 'నాల్గవ కుటుంబనియంత్రణ వ్యతిరేకోద్యమం సమావేశం' ప్రారంభోత్సవానికి వెళ్తున్నారు హెంద్రే. ఈ సమావేశాన్ని హిందూ మిషన్, విశ్వహిందూపరిషత్ వారు ఏర్పాటు చేస్తున్నారు. అయిదవ సమావేశం హైదరాబాదులో వుంటుందట.

హెంద్రే హిందువు. హిందువుల్ని ఉద్ధరించాలని

ంకణం కట్టుకున్నారు. 'కుటుంబ నియంత్రణ వల్ల క్రమక్రమంగా హిందువులు క్షీణించిపోతున్నారు. ముస్లిములు క్రయిస్తవులు ప్రబల మవుతున్నారు. ఇప్పుడు భారతదేశంగా పిలువబడే మన హిందూ దేశంలో కొన్నాళ్ళకి హిందువు అనేవాడు కనిపించ కుండా పోతాడు' అని హెంద్రే భయం.

ఈ భయంతోనే హిందువుల్ని మేల్కొల్పాలని అతని ప్రయత్నం.

'మీ ఉద్యమాన్ని ఏ పార్టీ అయినా సమర్థిస్తున్నదా?' అని అడిగినప్పుడు 'లేదు' అని సమాధాన మిచ్చారు.

'ఏ పార్టీ బలమూ నాకు లేదుగాని అన్ని పార్టీల్లోని

## అవీ-ఇవీ...

'ముఖ్యమైన వ్యక్తులూ' నా ఉద్యమాన్ని సమర్థిస్తున్నారు. నాకు సహకరిస్తున్నారు. వాళ్ళ పేర్లు చెప్పకూడదు కొన్నాళ్ళవరకు' అన్నారాయన.

హెంద్రేకి ముగ్గురు పిల్లలు. (ఆరోగ్య కారణాల దృష్ట్యా కుటుంబనియంత్రణ పాటించవలసి వచ్చిందట!)

కుటుంబ నియంత్రణకి ఖర్చుపెట్టే కోట్ల కొద్దీ డబ్బు గంగపాలవుతున్నదని అతని అభియోగం. ఆ డబ్బుని వ్యవసాయం మీద కేంద్రీకరించినట్లయితే దేశం సుభిక్షమవుతుంది—అని అతని సలహా.

కుటుంబ నియంత్రణ గురించిన ప్రాపగాండా పిల్లల్ని పెడత్రోవల పెట్టుతున్నదని బాధపడ్డారు హెంద్రే.

హిందువుల్ని ఉద్ధరించడానికి లేవదీసిన ఈ ఉద్యమాన్ని గుర్తించమని శ్రీమతి గాంధికి అనేక ఉత్తరాలు రాశారట. స్వయంగా చర్చించాలని ప్రయత్నించారట. కాని, శ్రీమతి గాంధి హెంద్రేకి కనీసం ఇంటర్వ్యూ కూడా ఇవ్వకుండా నిరుత్సాహపరిచారట.

హెంద్రే నిరుత్సాహపడలేదు. పట్టుదల ఎక్కువయింది. ఎంత ఖర్చయినా సరే భరించి ముందుకు సాగాలని నిశ్చయించుకున్నారు.

క్రయిస్తవులకి పోప్‌లాగా ముస్లింలకి మవుల్వీల లాగా హిందువులకి శంకరాచార్యుల వారు ఈ వుద్యమాన్ని బలపరుస్తున్నారట.

చాలా సంస్థలు ఈ వుద్యమానికి సాయం చెయ్యాలని ముందుకు వస్తున్నాయట. కాని, బయటపడడం లేదు. ప్రకటనలు వెయ్యడానికి పత్రికలు వెనకాడుతున్నాయట. హెంద్రే రాసిన పుస్తకాలు అమ్మడానికి కూడా భయపడుతున్నారట.

ఈ కుటుంబ నియంత్రణ వ్యతిరేక ఉద్యమాన్ని పూరీ శంకరాచార్యులవారు 1972 జనవరి 12వ తేదీన ఢిల్లీలో ప్రారంభోత్సవం జరిపారట.

గత మూడు సమావేశాల ద్వారా ప్రజలనుంచి ఈ ఉద్యమానికి చాలా మద్దతు లభించిందని హెంద్రే చెప్పారు. —పిక రాజు

* * *

కళాదర్బార్ (రాజమండ్రి) వారు నిర్వహించిన భరతనాట్యం, కూచిపూడి, జానపద నృత్యపోటీలలో విజయవాడ వాస్తవ్యులైన శ్రీ ఎం. జగన్నాథరావు గారి కుమారుడు చి. రమేష్, కుమార్తెలు చి. సుమ, ఉమలు మొత్తం 9 బహుమతులని గెలుచుకొన్నారు. భరత నాట్య కళాప్రపూర్ణ శ్రీమతి నాసిరెడ్డి కనకదుర్గ పోటీలలో గెలిచిన వారికి బహుమతి ప్రదానం చేశారు. (ఒ. వి.)

* * *

తెలుగు పఠనమందిరం (నిర్లివాకం) పదవ వార్షికోత్సవం అక్టోబరు 2 న మదరాసులోని సయాన్ని థియేటర్‌లో జరిగింది. ఈ సమావేశానికి డాక్టర్ సి. ముద్దుకృష్ణారెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర, శ్రీ ఎస్. ఆర్. నంది ప్రసంగించారు. కార్యదర్శి శ్రీ వై. ఉమామహేశ్వరరావు వార్షిక నివేదికని చదివారు. సమావేశానంతరం చక్రవర్తిచిత్ర వారి 'సుడిగుండాలు' చిత్రాన్ని ప్రదర్శించారు. (ఒ. వి.)

# ఒకవారంవిపరీతం

**అసూయ–ఆగ్రహం–హత్య**

పోత్తనూరుకు చెందిన మెట్టూరులో జింకు రేకులు చేసే వో కంపెనీలో పూవై అమ్మాళ్ అనే అమ్మాయి ఆడవారి మీద మేస్త్రీగా వుండేదట. తన పనిని సరిగా చేయలేకపోతోందని ఆ కంపెనీ వారు పూవై అమ్మాళ్ ని ఆ పనిలోంచి తొలగించి, అదే పనిని మారప్ప గవుండర్ కూతురు సుశీలకు ఇచ్చారట. దాంతో పూవైఅమ్మాళ్ కు కోపం వచ్చి, ఆ కోపాన్ని అణచుకుని, 'నీ పాత జీతం డబ్బులు తీసుకోడానికి మా యింటికి రా' అని సుశీలను పిలిచి గమ్మున ఆమె మీద కిరసనాయిలు పోసి అగ్గిపుల్లగీసి, మీద పడేసిందట. వళ్ళంతా కాలిపోయి, సుశీల ఆసుపత్రిలో చనిపోయిందట.

**గర్భవతులు–జాగ్రత్తలు !**

పిల్లులకు, పచ్చి మాంసానికి గర్భాన్ని పోగొట్టే శక్తి వుందని, కనుక గర్భవతులైన స్త్రీలు యీ విషయంలో చాలా జాగ్రత్తగా వుండాలని, స్కాంట్లండూ స్ట్రాత్ క్లైడ్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసరు డబ్ల్యు. యమ్. హచిసన్




అన్నారట. గర్భవతులైన స్త్రీలు పచ్చిమాంసాన్ని వండుతున్నప్పుడు దాన్ని వాసన చూడడం, పెంపుడు పిల్లులను తగిలించుకోడం వంటివి చేయకూడదని ఆయనన్నారట. పెంపుడు పిల్లులను ముద్దు పెట్టుకునే అలవాటును కూడా ఆయన ఖండించారట. —ఫాలాక్షుడు ●

## హైదరాబాద్ ...

(7వ పేజీ తరువాయి)

గణేశ్ లాల్ సార్వకాలిక సత్యాలు తెలిపే ఉపనిషద్వాక్యాలు వివరించగా, శ్రీమతులు జానకీ సీతారామరావు, పద్మాసుందర వరదన్, రాజ్యలక్ష్మి అయ్యంగారు. కుమారి పి. ఎస్. గీత – భవభూతి, కాళిదాసాదుల శ్లోకాలను సంగీత మధురంగా ఆలపించారు.

**మినీ కాన్వకేషన్ లు**

ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ నూకల నరోత్తమరెడ్డి ధైర్య సాహసాలు తలచుకొన్నప్పుడల్లా నాబోటి పిరికివానిగుండెకూడా ఉత్సాహంతో కొట్టు కొంటుంది.' ఏది నమ్మినా చిత్తశుద్ధితో, పర్యాలోకనతో నమ్మడం, నమ్మినదానిని ధైర్యంగా ఆచరణలో పెట్టడం గోల కొండ పత్రికను నిర్వహించినప్పటినుంచి

# స్త్రీలోని మాతృత్వం



ధర్మపథం — బులుసు వేంకటరమణయ్య

శ్రీ రామకృష్ణపరమహంస మాతృదేవిని సంతృప్తిపరచుటకై మాత్రమే శారదామణీదేవిని వివాహము చేసికొనెను కాని సంసారసుఖాలను అనుభవించాలనే అభిప్రాయంతో కాదు. ఆమెను మాతృదేవి మాదిరిగానే చూచుచుండెను.

ఒకసారి ఒకరు ఆయనను 'మీరు గృహస్థులుగా మీ సతీమణితో ఎందుకు జీవితం గడపలేదు?' అని ప్రశ్నించగా— పరమహంస దానికి సమాధానంగా ఒక కథమాత్రం చెప్పారు. ఆ కథ ఏమంటే—

'గణపతి వాహనం మూషికం కదా! ఆ ప్రాంతానికి ఒకప్పుడు ఒకపిల్లి వచ్చింది. అతడు వెంటనే దాన్ని తన గోళ్లతో గీరగా అది పారిపోయింది. తర్వాత అతడు తల్లిదగ్గరకు వెళ్లి ఆమె బుగ్గలమీద రక్కులుండడం చూచి ఆశ్చర్యపడి 'అమ్మా! ఈ రక్కులేమిటమ్మా?' అని పార్వతీదేవిని ప్రశ్నించాడు.

'నువ్వు గోళ్లతో గీరిన రక్కులే నాయనా ఇవి' అని ఆమె మరీ ఆశ్చర్యం కలిగించింది,

'నేనా? నేనా?'

'అవును నువ్వే! నువ్వు పిల్లి ఒంటిమీద గోళ్లతో గీరలేదూ? ప్రపంచంలో ప్రతిప్రాణిలో నేనున్నాను. అంతా నా స్వరూపమే! నువ్వు మార్జాలాన్ని గీరితే ఆ రక్కులు నా బుగ్గలమీద పడ్డాయి.' అని ఆమె శాంతంగా సమాధానం యిచ్చింది. గణనాథుడికి అప్పుడు విషయం అవగతమయింది.

అతడు అంతర్దృష్టితో బాగా పరిశీలించాడు. ప్రతిస్త్రీలోనూ అతనికి తన మాతృమూర్తియే కనబడసాగింది. స్త్రీజాతి అంతా తనకు దివ్యమైన మాతృదేవిగా గోచరించ సాగింది.

గణపతి పెండ్లి చేసుకోకపోవడానికి కారణం యిదే, ఏ కన్యను వివాహమాడ దలచుకొన్నా, ఆమెయందు మాతృభావమే కలుగుతున్నప్పుడు ఎవర్ని పెండ్లి చేసుకుంటాడు? అందువల్లనే ఆయనకు పెండ్లి చేసుకోవాలనే సంకల్పమే లేకపోయింది.'

పరమహంస యీ విధంగా చెప్పి, ఒక్కక్షణం ఆగి 'నాకున్నూ ప్రతిస్త్రీయందున్నూ పార్వతీదేవి స్వరూపమే కానవస్తూ ఉన్నది. శారదా మణీదేవియందున్నూ ఆ దేవీరూపమే కనబడుతుంది.'

ఇలా చెప్పి 'స్త్రీని చూడడంలో మూడు పద్ధతులు. మొదటిది మాతృదేవిగా చూడడం; రెండవది మిత్రురాలినిగా భావించడం. మూడవది సతిగా భావించడం. వీటిలో మొదటి భావన ఉత్తమోత్తమం. రెండవది కొంతవరకూ ఉచితమైనది, మూడవ రీతి ఉచితమైనది కాదు' అన్నారు. ●

---

ఆయన స్వభావం. ఇటీవల వైస్‌చాన్సలర్ అయిన కొన్నినెలలోనే — ఆయన చేసిన రెండుపనులూ అపూర్వమైనవి, దేశంలోనే మొట్టమొదటివి, పూర్వపు వైస్‌చాన్సలర్లు ఎవరూ సాధించలేనివి.

## హైదరాబాద్...

వీటిలో మొదటిది మినీకాన్వకేషన్— ఆయా కళాశాలలలో స్నాతకోత్సవాలు జరుపడం. పూర్వంఅంటే కొద్దిమందే పట్టభద్రులయ్యేవారు. వారికి ఏ గొప్పవారో పట్టాలు ఇవ్వడం అందంగా ఉండేది. ఇప్పుడు, సంఖ్యతోపాటు స్వభావాలలో విభేదాలూ పెరగడంవల్ల ఆయా కళాశాలలలో పట్టాలు ఇస్తే చాలు. అల్లర్లు, పోలీసుల జోక్యాలు, న్యాయస్థానాల తీర్పులు ఉండవు.

రెండవది సాయం కళాశాలలలో పోస్టు గ్రాజుయేట్ డిగ్రీ తరగతులు. ఇవి బషీర్‌బాగ్‌లోని సాయం కళాశాలలో ప్రారంభమయాయి. గొప్ప వక్తగా విఖ్యాతులయిన శ్రీ పి. వి. రాజగోపాల్ ప్రిన్సిపాలుగా సమర్థులు, విద్యార్థివత్సలులు అయిన ఆచార్యులు ఉన్న ఈ కళాశాల శ్రీ నరోత్తమ రెడ్డి లక్ష్యాలను పూర్తిగా సాధిస్తుందని విజ్ఞుల నమ్మకం. విశ్వవిద్యాలయంలో పోస్టుగ్రాజ్యుయేట్ తరగతులు మాత్రమే ఉండే ఏర్పాటూ చేస్తున్నారు. ఆయన. దానితో దేశంలోనే ప్రశాంతతకు, అందానికీ పేరుపొందిన ఉస్మానియా జామియా తన కీర్తిని ఇనుమడింపజేసుకోదూ మరి?

**ఉపశ్రుతి**

వృత్తికి, చదువుకూ సంబంధమంటే ఒక విచిత్రఘటన జ్ఞాపకం వచ్చింది. పదిపన్నెండు సంవత్సరాలక్రితం ఆంధ్రపత్రిక కార్యాలయందాటి వీధిలో అడుగు పెడుతూనే ఒక టాక్సీవాలా సలాంకొట్టి 'టాక్సీసార్' అన్నాడు. నేను ముందుకు పోబోతున్నాను. నవ్వుతూ మరొకసారి సలాం కొట్టాడు. చూచాను. 'అరే! మీరా? రంగరాజ్! ఈ వేషమేమిటి?' అన్నాను; వెంటనే నాలుక కొరుక్కున్నాను. ఆయన నా పూర్వ సహోద్యోగి, రచయిత, ఆనర్సు పట్టభద్రుడు. ఒక పత్రికలో సబ్ ఎడిటర్. 'ఏవృత్తి అయితేనేం? డిక్కెన్సు చదివితే డ్రైవరు కాగూడదని వుందా? దీనిలో కొంత శ్రమ ఉన్నా సులభంగా రోజుకు 20 రూపాయలు గిట్టుబాటు' అన్నాడు. నేను కొంచెం విస్తుపోయినా, అవును. చదువుకీ, స్వభావానికీ వృత్తితో సంబంధం లేదేమో! కాని, చదువుకొన్నవాడు ఏ వృత్తిలో దిగినా ఆ వృత్తి మెరుగవుతుందనడం నిజం' అనుకున్నాను. ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1, and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3. Editor : S. Radhakrishna.

